శ్రీ శ్రీ శ్రీ సచ్చిదానందాభినవ గంగాధర సుబ్రహ్మణ్య భారతీస్వాములవారి నారాయణస్మరణపూర్వక శుభాశీస్సు.



బ్రహ్మశ్రీ విరాజమాన జటావల్లభోపాహ్వ పురుషోత్తమార్యాః ప్రాయేణ ఆంధ్రదేశీయానాం ధర్మబోధక గ్రంథరచన ప్రచారాదినా నితరాం పరిచితపూర్వాః ఇతినివేదనే నాతిశయోక్తిః.

శ్రీపురుషోత్తమార్యాః మనుస్మృతి ఖనిజాని కాని చిత్సూక్తిరత్నాన్యుద్ధృత్య స్వోక్తిసువర్ణతంత్ర్యాం సంఘటయ్య "ధర్మమంజరీం" బబంధ. గ్రంథమేత మాకలయ్య సంతుష్టాంతరంగాః స్మః.

వింశతితమేఽస్మిన్ శతాబ్దే పాశ్చాత్యసంప్రదాయేన శిక్షితాః కతిచన పురుషా మన్వాదిస్మృత్య నభిజ్ఞతయా ప్రాచీనార్ష గ్రంథేషు నితరామనభిరుచిం, అశ్రద్ధాం చావిష్కుర్వంతి.

కరాళేఽస్మిన్ కాలే స్మృత్యుక్తీరుపదిశ్య అర్వాచీనానాం పండితానాం యథా మతిపరివర్తనం భవతి తథాప్రయతితవ్య మితిమనీషయా ధర్మమంజరీమిమాం విరచయ్య పురుషోత్తమార్యాః కృతకృత్యా ఆసీదిత్యత్ర నాస్తి సంశయలేశః.

"యద్వై కించమను రవదత్తద్భేషజం" ఇతిశ్రుతి రపిగదార్తస్య భేషజసేవేవ మనునూక్తిర్మనుజస్య హితకరీతి ప్రశంసతి.

ధర్మవివేక సమాజవ్యవస్థాఽఽచారాఽధ్యాత్మిక సాధనాఖ్య ప్రకరణచతుష్టయ సముల్లసితేఽస్మిన్ ప్రబంధే 'ధర్మఏవసుహృత్' 'జీవానాం స్వకర్మానుసారేణైవ సుఖదుఃఖానుభవః, ఇత్యాదికం, వృద్ధసేవాధనాగమోపాయాఽహింసాఽతిథిపూజాదికంచ విషయజాతం మనూక్తిదిశాసుష్ఠూపపాదితం. విదుషాం చిత్తకుముదకోరకాణి వికాసయన్నయం గ్రంథః రాకాచంద్ర ఇవసముల్లసతితరాం.

ధర్మమంజరీ గ్రంథప్రణేతారం పురుషోత్తమార్యం శ్రీశాంకరపీఠాభిమానినీ వాగీశ్వరీ శారదాంబా ఇతోఽధికశ్రేయః ప్రదానేన అనుగృహ్ణాత్విత్యాశాస్మహే—ఇతి శివమ్.

# న్యాయవేదాన్తపారీణ శ్రీ బులుసు అప్పన్నశాస్త్రిగారి

## శుభాశంస.

---

బ్రి. వే. జటావల్లభుల పురుషోత్తము ఎం. ఏ. గారు ఆంధ్రలోకమునకంతకును తెలిసిన ధర్మావబోధక మహాపురుషులు. వారు వాగ్రూపముననే కాక క్రియారూపమునను ధర్మసేవాతత్పరులు, బహు గ్రంథరచయితలు. వారు రచించిన యీ "ధర్మమంజరి" యనుధర్మశాస్త్రములో నచ్చటచ్చటనుండి విద్వాంసులకుగూడ సనూత్నపద్ధతిలో క్లిష్టములైన విషయములను లోకమున కందజేయుటకు సమర్థమైయున్నది.

సత్త్వప్రధానమైన యంతఃకరణముగలవారికే కాని ధర్మస్వరూపము సరిగా గోచరింపదు. పురుషోత్తముగారు సత్సంస్కారశోభితులు, ధర్మాధర్మనిర్ణయదక్షులు. "ధర్మమొక్కటియే మిత్రము" "మానవజన్మసార్థక్యము" "కర్మఫలము" "మోక్షసాధనము" "పెద్దలసేవ" "జపము" "ఇంద్రియనిగ్రహము" మున్నగు విషయముల నెత్తికొని మనువాక్యోదాహరణపురస్సరముగా వీరు గావించిన యీరచన ధర్మజ్ఞానజ్యోతియై యీనాడు వ్యాపించియున్న తమస్సును తొలగించుటకు దక్షమై యున్నది.

ఇట్టి ధర్మావబోధక గ్రంథమును రచించిన పురుషోత్తముగారికి పార్థసారథి వేదోక్తసంపూర్ణాయువు నొసగి యిట్టియుత్తమధర్మ ప్రబోధక గ్రంథముల నింకను రచించునట్లనుగ్రహించుగాక!

బులుసు అప్పన్నశాస్త్రి.

---

# FOREWORD.

*By*

The Venerable **Sri K. S. Ramaswami Sastriar**,

[The Vetern and Tireless Champion and Exponent of ancient Indian culture and religion.]

I feel honoured by the request of the author, Sri Jatavallabhula Purushottam Garu, to me to write a foreword to this excellent and valuable work giving to Andhra Desa, in the Telugu tongue, the immortal and eternal spiritual ideals and practical ethical lessons contained in that book of books known as Manu's Code (Dharma Sastra). Sri Purushottam is a reputed scholar in Sanskrit and Telugu and is admired as a fluent, able and popular lecturer. He is an excellent poet in Sanskrit and his Chitra Satakam is a valuable work. In his earlier Telugu work, "Hindumatamu", he showed the essence of Hinduism.

In this work, he shows well how Manu's code is not for any particular latitude or longitude or for any particular country or religion or community or caste but is meant for all men in all climes and at all times. Manu's standard work contains the ideal, ethical and social and spiritual pattern of human life in such an admirable way that Kalidasa, the supreme national poet of India, exclaimed in his Raghuvamsa which is the epic of Indian culture, civilisation and religion *par excellance:*

రేఖామాత్రమపి క్షుణ్ణాదామనోర్వర్త్మనః పరం
నవ్యతీయుః ప్రజాస్తస్య నియంతుర్నేమివృత్తయః (1-17)

The author has well classified the basic and fundamental ideas of Munu under four heads. Viz. Dahrma (Individual Ethics), Samajika Vyavastha (Social ethics), Achara (personal conduct including ceremonial and sacramental doings), and Adhyatmika Sadhanas (means of Self-Realisation). Mauu regards this world not as a place of pleasure but as a place of probation for perfection. Virtuous conduct *cum* ceremonial purity will bring about such mental purification as will fit a person for the highest spiritual realisation in the shape of God-Communion and God-union. Every person is born with a three-fold debt i. e. a debt to the devas, a debt to the sages and a debt to the pitris or means, and this three-fold debt can be discharged by sacrifices; by Vedic studies and by the birth of sons. it is only, by the discharge of such debts that a man can aspire for spiritual liberation and perfection.

ఋణాని త్రీణ్యపాకృత్య మనో మోక్షే నివేశయేత్ (2-35)

The special value of Manu's vision of life is its integrality and its progressive exaltation and sublimation of life.. Life is a place of probation and the earth is a vestibule of paradise. The proper attitude to life is the avoidance of avid sensualism and arid asceticism. The essence of life is *Samatva* (equipoise) and *Karmasu Kousalam* (skilful sublimation of life) to use the

language of the Bhagavat Gita. This is why the Veda says in a famous passage.

“యద్వైకించ మనురవదత్తద్భేషజం” (Tai. Sam II, 2-10

(What Manu declares is a medicine for the ills of life.)

In a well-known verse Manu says that Dharma, Artha and Kama form the trivarga (the three-fold aim) as we are all made of the three gunas sathva, rajas and tamas. He says that the love of Kama (sense-pleasure) is due to Tamoguna, that the love of Artha (wealth) ; due to Rajoguna and the love of Dharma (Righteousness is due to Sattwaguna. Dharma is superior to Arthi and Artha is superior to Kama, just as Sathvaguna is superior to Rajoguna and Rajoguna is superior to Tamoguna.

తమసో లక్షణం కామో రజసస్త్వర్థ ఉచ్యతే
సత్త్వస్యలక్షణం ధర్మః శ్రైష్ఠ్యమేషాం యథోత్తరం.
(XII-38

Dharma is the real friend and ally of the soul. The source of Dharma is Veda, Smriti. achara and self-satsfaction of good men. (II-6). By such practice of dharma, we can get renown on earth and bliss in paradise. (II-9) We must observe Vedadhyayana, Vrata, Home, Yajna. righteous family life etc. because these will transmute an earthly body into a heavenly body.

స్వాధ్యాయేన వ్రతైర్హోమై స్త్రైవిద్యేనేజ్యయాసుతైః
మహాయజ్ఞైశ్చయజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః.

(II—28)

మంగళాచారయుక్తానాం నిత్యంచ ప్రయతాత్మనాం
జపతాం జుహ్వతాంచైవ వినిపాతో న విద్యతే

(IV - 146. see also V-47)

Manu stresses reverence for womanhood.

యత్రనార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః
స్త్రియః శ్రియశ్చ గేహేషు నవిశేషోఽస్తి కశ్చన,

(III—56, IX-26)

In respect of asramas Manu exalts the equipoise of Vanaprastha; and the renunication of Sanyasi, but it is the Grihastha that feeds and sustains them. The supreme perfection of life is in God-Communion and God-union resulting in self-liberation and self-realisation.

సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖం.

(IV—160)

Such is the exalted message of Manu, the leader and saviour to Man in all times. This work of Purushottam Garu represents the fruits of a life-long study of Manu's world-view and of a general and wide and full knowledge of Indian literature as a whole. I commend the author's Dharma Manjari as giving us the quintessence of Manu's Code and Gospel.

K S. Ramaswami Sastri.
(Retired District Judge.)

# విషయ సూచిక.

# ధర్మమంజరి.

## ౧. ధర్మవివేకము.

సుఖమార్గమునకే ధర్మమార్గమని పేరు. ధర్మమాచరించుచున్నవాడు దుఃఖ మనుభవించుటయు, నధర్మ మాచరించువాడు సుఖ మనుభవించుటయు లోకములో కన్పట్టుట లేదాయన: ఆచరించు ధర్మాధర్మములకు ఫలము వెంటనే సంభవింపక పోవచ్చును. ఎన్నడో చేసిన ధర్మాధర్మముల కిప్పుడు ఫల మనుభవములోనికి రావచ్చును. ఇప్పుడు చేయుచున్న ధర్మాధర్మములకు ఫలమిక ముందెప్పుడో యనుభవములోనికి రావచ్చును. భౌతిక ప్రపంచములోకూడ నిట్టియనుభవము మనకు కన్పట్టుచున్నది. నిన్న తిన్న యజీర్ణవస్తువునకు ఫలము నిన్ననే కల్గుటలేదు, నేడుకల్గుచున్నది. పుణ్యపాపములకు సంబంధించిన ఫలము చిరకాలమునకు పిమ్మట గాని, జన్మాంతరములో గాని, లోకాంతరములో గాని కల్గుననుటలో నాశ్చర్యములేదు. వ్యవసాయము జరుగుచున్న భూమియప్పటికప్పుడే ఫలింపదు. కావున పాపులు సుఖముగా నుండుటను, పుణ్యాత్ములాపదలతో నుండుటనుచూచి యెవ్వ

డును ధర్మమువలన లాభములేదనియు నధర్మమువలన హాని లేదనియు తలంపరాదు.

నాఽధర్మశ్చరితో లోకే సద్యఃఫలతి గౌరివ
శనై రావృత్త మానస్తు కర్తుర్మూలాని కృంతతి. (4-172)

అధర్మము చేసినవెంటనే దాని ఫలము కన్పడకపోవచ్చును. భూమి దున్నినవెంటనే ఫలము నీయదుకదా! అధర్మము క్రమముగా ఫలోన్ముఖమై కర్తను సమూలముగా నాశనముచేయును.

యదినాత్మని పుత్రేషు నచేత్ పుత్రేషు నప్తృషు,
నత్వేవతుకృతోఽధర్మః కర్తు ర్భవతి నిష్ఫలః (4-173)

అధర్మము చేసినవానికి తత్ఫలము స్వవిషయములో కాకపోయినను, కుమారుని విషయములో కాని, మనుమని విషయములోకాని అనుభవములోనికి వచ్చును. అంతేకాని వ్యర్థముగాపోదు. కావున తాత్కాలికముగా సుఖము నపేక్షించి గాని దుఃఖమును తప్పించుకొనుటకు గాని యధర్మమును చేయరాదు. ఆయధర్మము వలన వచ్చు దుఃఖ మింతకంటె మిక్కుటముగా నుండును.

నసీదన్న పిధర్మేణ మనోఽధర్మే నివేశయేత్,
అధార్మికాణాంపాపానామాశుపశ్యన్ విపర్యయం. (4-171)

ధర్మముతో నున్నవాడు దారిద్ర్యాదులచే బాధపడుచున్నను అధర్మమందు బుద్ధిని చొరనీయకూడదు. ధర్మమును వీడుచో దుఃఖముపోయి సుఖమువచ్చునని తలంపరా

డు. అధార్మికులు చేయు పాపములకు కలుగబోవు దుఃఖము నుగురించి యాలోచింపవలయును.

అధార్మికో నరో యోహి యస్య చాప్యనృతం ధనం
హింసారతశ్చ యోనిత్యం నేహాసౌ సుఖమేధతే.(4-170)

ఎవడు ధర్మహీనుడో, ఎవడు అన్యాయముచే ధనమును సంపాదించునో, ఎవడు హింసాపరుడో వానికి సుఖముండదు.

ఏకర్మకు నెంతకాలము పోయిన పిమ్మట, నేలోకములో, నేజన్మములో నేవిధమైన ఫలమువచ్చునో యెరిగిన మహామహులు ధర్మాధర్మములను గురించిన విజ్ఞానమును మన కందజేసి యున్నారు. వేదమే మూలముగాగల యీ విజ్ఞానము ధర్మశాస్త్రములోను, పురాణములలోను సర్వజన సులభముగా ప్రతిపాదింపబడియున్నది. అపారమైన యీవిజ్ఞానము యొక్క సంగ్రహ స్వరూపము మనుస్మృతి. ఈగ్రంథము మానవునకు శుభప్రదము, మరియు జపహోమాది సత్కర్మ బోధకమగుటచే శ్రేష్ఠమయినది; బుద్ధిని వృద్ధిపొందించునది, మోక్షోపాయ బోధకమైనది. కావున సర్వోత్కృష్టమయినది.

ఇదం స్వస్త్యయనం శ్రేష్ఠ మిదం బుద్ధి వివర్ధనం
ఇదంయశస్యమాయుష్య మిదంనిః శ్రేయసంపరం(1-106)

వేదములు, వేదవిరుద్ధములుగాని స్మృతులు, వేదస్మృతులకు విరుద్ధముగాని సదాచారము-ఇవి ధర్మమును నిర్ణయిం

చుకొనుట కాధారములు; వీని నెన్నడును ధిక్కరింపరాదు. వీనికి వ్యతిరేకముగా నుండనంత వరకుమాత్రమే మన స్వప్తి ప్రకారము నడచుకొనవచ్చును.

వేదస్మృతి స్సదాచారః స్వస్యచ ప్రియమాత్మనః
ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్యలక్షణమ్ (2_13)

## భా ర త దే శ ము ధ ర్మ భూ మి.

ధర్మాచరణబుద్ధి గలవారికి భారతదేశమే వాసయోగ్యమని మనుస్మృతి వలన తెలియుచున్నది. (ఆధునిక ప్రాచ్య పాశ్చాత్య ప్రముఖుల దృష్టిలోను నిష్పక్షపాత విమర్శకుల దృష్టిలోనుకూడ భారతదేశము ధార్మికముగాను, ఆధ్యాత్మికముగాను ఎల్లదేశములలోను మిన్నయని నా 'భారతీయ వైభవము' 'చిత్రశతకము' మున్నగు గ్రంధములలో నిరూపించి యున్నాను.)

మనువు భారతదేశములోని నాలుగు భాగములను పేర్కొనినాడు; (1) బ్రహ్మావర్తము, (2) బ్రహ్మర్షి దేశము (3) మధ్యదేశము, (4) ఆర్యావర్తము. ఈనాల్గింటిని చెప్పిన పిమ్మట కృష్ణమృగము (నల్లలేడి) చరించు ప్రదేశమంతయు యజ్ఞియ భూమియని చెప్పినాడు. కృష్ణమృగము పైనాలుగు ప్రదేశములలోనే కాక మిగిలిన భారతదేశ మందంతటను తిరుగును. కావున భారతదేశ మంతయు యజ్ఞియభూమి. అందు ప్రత్యేకముగా పేర్కొనబడిన నాల్గు ప్రదేశములును విశేషముగా పుణ్యభూములని తాత్పర్యము.

సరస్వతీ దృషద్వత్యో ర్దేవనద్యో ర్య ద న్తరమ్,
తం దేవ నిర్మితం దేశం బ్రహ్మావ ర్తం ప్రచక్షతే (2–17)

సరస్వతి, దృషద్వతి యను రెండు పుణ్యనదుల నడుమగల దివ్య ప్రదేశమును బ్రహ్మావ ర్తమని చెప్పుదురు.

కురుక్షేత్రం చ మత్స్యాశ్చ పాంచాలాః శూరసేనకాః,
ఏష బ్రహ్మర్షి దేశో వై బ్రహ్మావర్తా దన న్తరః (2-19)
ఏతద్దేశ ప్రసూతస్య సకాశాదగ్ర జన్మనః,
స్వంస్వంచరిత్రంశిక్షేరన్ పృథివ్యాంసర్వమానవాః (2–20)

కురుక్షేత్రము, మత్స్యదేశము, పాంచాలము, శూరసేనము–ఇవి కలసి బ్రహ్మర్షి దేశ మనబడును, ఇది బ్రహ్మవ ర్తము నానుకొనియున్నది. ప్రపంచములోని అన్ని దేశములవారును ఈ దేశములో జన్మించిన బ్రాహ్మణునివలన తమ తమ యాచారములను తెలిసికొనవలయును.

హిమవ ద్వింధ్యయోర్మధ్యం యత్ప్రాగ్వినశ నాదపి,
ప్రత్యగేవ ప్రయాగాచ్చ మధ్యదేశః ప్రకీ ర్తితః (2-21)

హిమవద్వింధ్య పర్వతములకు మధ్యగాను, సరస్వతీ నద్యంతర్ధాన ప్రదేశమునకు తూర్పుగాను, ప్రయాగకు పశ్చిమముగను ఉన్న దేశము మధ్యదేశ మనబడును.

ఆ సముద్రాత్తు వై పూర్వా దా సముద్రాత్తు పశ్చిమాత్
తయోరేవా న్తరంగిర్యో రార్యావ ర్తంవిదుర్బుధాః (2–22)

తూర్పు పడమరగల సముద్ర పర్యంతము వ్యాపించి, వింధ్య హిమాచలముల మధ్యనున్న దేశమును ఆర్యావ ర్తమని పండితులు చెప్పుదురు.

కృష్ణ సారస్తు చరతి మృగోయత్ర స్వభావతః
సజ్ఞేయో యజ్ఞియో దేశోమ్లేచ్ఛ దేశ స్త్వతఃపరః (2-23)

కృష్ణ సారమను నల్లని లేడి ఏ ప్రదేశములో స్వభావముగానే తిరుగునో అది యజ్ఞార్హమైన ప్రదేశము. మిగిలిన ప్రదేశములు మ్లేచ్ఛదేశములనబడును.

ఏతాన్ ద్విజాతయో దేశాన్ సంశ్రయేరన్ ప్రయత్నతః
శూద్రస్తు యస్మిన్కస్మిన్వా నివసేద్వృత్తికర్శితః. (2-24)

ఈ దేశములను - బ్రహ్మావర్తము, బ్రహ్మర్షి దేశము, మధ్యదేశము, ఆర్యావర్తము, అనువానిని మరియు కృష్ణ మృగము తిరుగు ఇతరప్రదేశములను – ద్విజులు ప్రయత్న పూర్వకముగానైనను ఆశ్రయింపవలయును. శూద్రుడుకూడ ఈ దేశములలోనే నివసింపవలయును. కాని వృత్తి లేక బాధ పడు నపు డాతడు ఇతర దేశముల కేగవచ్చును. (కృష్ణమృగము ఈ నాల్గు దేశములలోను, దక్షిణ భారతములోను తప్ప ప్రపంచములో మఱి యే దేశములోను స్వాభావికముగా నుండదు. కావున భారత దేశ మే చాతుర్వర్ణ్యము వారికిని ముఖ్యముగా నివాసయోగ్యము.) అంతియే కాక, భారతేతర దేశములలోను, భారత దేశములో బ్రాహ్మణులు కనబడని ప్రాంతములలోను స్థిరనివాసమేర్పరచుకొన్న చాతుర్వర్ణ్యము వారికి ఉపనయనాది సంస్కారములు జరుగుటకును, బహుధర్మ పరిపాలనమునకును అవకాశముండదు. కావున వర్ణభ్రష్టత్వము సంభవించును. కొందరు క్షత్రియులారీతిగా వృషలత్వము పొందినారని మనువు చెప్పుచున్నాడు.

శనకైస్తుక్రియాలోపాదిమాః క్షత్రియజాతయః ।
వృషలత్వం గతాలోకే బ్రాహ్మణాఽదర్శనేనచ
పౌండ్రకాశ్చోడద్రవిడాః కాంభోజాయవనాశ్శకాః।
పారదాపహ్లవాశ్చీనాః కిరాతాదరదాః ఖశాః.(10-43,44

పౌండ్రిక, చోడ్రి, ద్రివిడ, కాంభోజ, యవన, శక, పారద, పహ్లవ, చౌన, కిరాత, దరద, ఖశ దేశములందు జన్మించిన క్షత్రియులు బ్రాహ్మణదర్శనము లేనివారై ఉపనయనాది సంస్కారహీనులై క్రిమముగా వృషలత్వము చెందిరి. (నివాసదేశమునకును ధర్మానుష్ఠానమునకును ఇట్టి సంబంధము కలదు.)

## చతుర్యుగములు_ధర్మస్థితి

చతుష్పాత్సకలో ధర్మః సత్యం చైవకృతేయుగే
నాఽధర్మేణాఽగమః కశ్చిన్మనుష్యాన్ప్రతి వర్తతే.(1-81

కృతయుగములో ధర్మము నాలుగు పాదములతోను నడచును, సత్యముకూడ నంతియే. ఆయుగములో నధర్మము చేత ధనసంపాదనము మున్నగు దోషములు మనుష్యులలో కనపట్టవు. (ఇట ధర్మములను గురించి చెప్పి మరల సత్యమునుగురించి ప్రత్యేకముగా చెప్పుటచేత ధర్మము లన్నింటిలోను సత్యమునకుగల ప్రాధాన్యము తెలియుచున్నది.)

ఇతరేష్వాగమా ద్ధర్మః పాదశ స్త్వవరోపితః
చౌరికానృత మాయాభి ర్ధర్మశ్చాపైతి పాదశః. (1-82)

త్రేతాద్వాపర కలియుగములలోధనాదిసంపాదనము

అధర్మముచేత జరుగుటవలన, అట్టి అధర్మార్జిత ధనాదులచే చేయబడు యజ్ఞాదిధర్మము యుగమున కొక పాదము చొప్పున క్రిందకు దిగిపోవుచుండును. త్రేతాయుగములో ధర్మము ముప్పాతిక పాలును ద్వాపరములో సగమును, కలిలో నాల్గవవంతును నిలచియుండును దొంగతనము, అసత్యము, మోసము మున్నగువానిచేతకూడ ధర్మముయొక్క ఒక్కొక్క పాదము క్రమముగా ప్రతియుగములోను లోపించును.

ధర్మము తగ్గిపోవుటకు చౌర్యము, అసత్యము, మాయ లక్షణములుగా నిచ్చట చెప్పబడుటచే మనువు మతములో నివి యెంత పెద్ద దోషములో, ఋజుప్రవర్తనము, సత్యము, అస్తేయము ఎంత గొప్ప ధర్మములో స్పష్టమగుచున్నది.

తపః పరం కృతయుగే త్రేతాయాం జ్ఞాన ముచ్యతే
ద్వాపరే యజ్ఞమేవాహుర్దానమేకం కలౌయుగే. (1-86)

అన్నియుగములలోను తపస్సు, బ్రహ్మజ్ఞానము, యజ్ఞము, దానము అనునవి ధర్మములే యైనను కృతయుగములో తపస్సు, త్రేతాయుగములో జ్ఞానము, ద్వాపరములో యజ్ఞము, కలిలో దానము ముఖ్యముగా గొప్ప ధర్మములు.

## ధర్మ మొక్కటియే మిత్రము

ధర్మముతప్పమరి యేదియు నమ్మదగినమిత్రము కాదు,

ఏకః ప్రజాయతే జంతురేక ఏవ ప్రలీయతే
ఏకోఽనుభుఙ్క్తే సుకృత మేక ఏవచ దుష్కృతం. (4-240)

మానవుడు పుట్టునప్పుడు ఒక్కడే పుట్టుచున్నాడు; మరణించునపుడుకూడ నంతియే. తన పుణ్యమును పాపమును తానొక్కడే అనుభవించుచున్నాడు.

మృతం శరీర ముత్సృజ్య కాష్ఠలోష్టసమంక్షితౌ
విముఖాబాంధవాయాంతి ధర్మ స్తమనుగచ్ఛతి (4-241)

కట్టెవంటియు, మట్టిపెల్లవంటియు : మృతకళేబరమును శ్మశానములో విడిచి బంధువులింటికి పోవుదురు. ఆపైనికూడ వచ్చునది ధర్మము మాత్రమే.

నాముత్రహి సహాయార్థం పితామాతాచ తిష్ఠతః
నపుత్రదారానజ్ఞాతి ర్ధర్మ స్తిష్ఠతి కేవలః. (4-239)

పరలోకమున సహాయమునకు తల్లిదండ్రి ఉండరు. భార్యా పుత్రులుండరు; జ్ఞాతియుండడు; కేవలము ధర్మమే యుండును.

ధర్మంశనైః సంచినుయా ద్వల్మీక మివపుత్తికాః
పరలోక సహాయార్థం సర్వభూతా న్యపీడయన్ (4-238)

పురుగులు పుట్టకొరకు మట్టిని సమకూర్చుకొనునట్లు మానవుడు పరలోక సహాయముకొరకై ధర్మమును నెమ్మదిగా సమకూర్చుకొనవలెను; ఏప్రాణిని బాధపెట్టకుండ సమకూర్చుకొనవలయును. (మను మతములో భూతదయ యెంత ముఖ్యమో దీనివలన తెలియుచున్నది.)

తస్మాద్ధర్మం సహాయార్థం నిత్యం సంచినుయా చ్ఛ్వనైః
ధర్మేణ హి సహాయేన తమ స్తరతి దుస్తరం. (4-242)

కావున ఎల్లప్పుడును సహాయముకొఱకై ధర్మమును నెమ్మదిగా సంపాదించుకొనుచుండవలెను. ధర్మమనెడు సహాయముచేత దుస్తరమైన తమస్సును మానవుడు దాటగలుగును.

ధర్మ ప్రధానం పురుషం తపసా హతకిల్బిషం
పరలోకం నయ త్యాశు భాస్వంతం ఖశరీరిణం. (4-243)

తపస్సుచేత పోగొట్టబడిన పాపము గల్గినట్టియు, ధర్మ ప్రధానుడైనట్టియు. బ్రహ్మస్వరూపుడై నట్టియు, పురుషుని ఆతని ధర్మమే దివ్యలోకమునకు తీసికొనిపోవును.

ధర్మము మానవుని ఉద్ధరించుట ఎంతసత్యమో, అధర్మము మానవుని ముంచివేయుట అంతసత్యము. ధర్మశబ్దములోనే యీ యర్థము కలదు. మానవుని మంచిస్థితిలో నిలబెట్టునది ధర్మము. "ధరతి ధారయతీతి వాధర్మః' 'ధారణాత్ ధర్మమిత్యాహుః' ఇత్యాది నిర్వచనము లీయర్థమునే తెలుపును.

ధర్మ ఏవహతోహంతి ధర్మోరక్షతి రక్షితః
తస్మాద్ధర్మోనహంతవ్యోమానోధర్మోహతోఽవధీత్. 8-15

ధర్మము కొట్టబడినదై మనలను కొట్టివేయును. రక్షింపబడినదై మనలను రక్షించును. కావున ధర్మము ఉల్లంఘింప దగినదికాదు. ధర్మము కొట్టివేయబడకుండు గాక! మనల నది అణచివేయకుండుగాక!

కావున ధర్మమొక్కటియే సర్వకాలములలోను తోడ్పడు మిత్రము,

ఏక ఏవసుహృద్ధర్మో నిధ నేప్యనుయాతి యః
శరీరేణ సమంనాశం సర్వ మ న్యద్ధిగచ్ఛతి. (8-17)

మరణానంతరము కూడ విడిచిపెట్టకుండ వచ్చునది ధర్మము. అది యొక్కటియే నిజమైన మిత్రము. మిగిలిన ధనవస్తు వాహనాదికమేకాక బంధువర్గముకూడ, శరీరముతోపాటే మానవుని విడిచిపెట్టి పోవును. 294-521

 కర్మ ఫలము 

ధర్మాధర్మములవలన గలుగు సుఖదుఃఖఫలముల నవశ్య మనుభవింపవలసియుండును. సర్వకర్మ ఫలప్రదాతయైన పరమేశ్వరునకు తెలియకుండ రహస్యాతి రహస్యముగ కూడ నెవడు నేపాపమును చేయజాలడు, "సహస్రాక్షస్సహస్రపాత్" అని చెప్పబడు సర్వేశ్వరుడన్నింటిని చూచుచునే యుండును. సూర్యచంద్రులు పరమేశ్వర నేత్రములుగా వర్ణింపబడిరి. అట్లే పృథివ్యాదులు పరమేశ్వర శరీరముగా వర్ణింపబడినవి. పృథివి, ఆకాశము, జలము, హృదయము, చంద్రుడు, సూర్యుడు యముడు, వాయువు, రాత్రి, ఉభయ సంధ్యలు, ధర్మము—అనునవి సర్వకర్మలకును సాక్షులు.

ద్యౌర్భూమిరాపోహృదయంచంద్రార్కాగ్నియమానిలాః
రాత్రిస్సంధ్యేచధర్మశ్చవృత్తజ్ఞాస్సర్వదేహినాం,(8-86)
శుభాశుభఫలం కర్మమనో వాగ్దేహసంభవమ్
కర్మజాగతయో నృణాముత్తమాధమమధ్యమాః(12-3)

మనస్సుచేతను, వాక్కుచేతను, శరీరముచేతను చేయబడుకర్మ శాస్త్రవిహితమైనదగుచో సుఖమును, శాస్త్రనిషిద్ధమైనదగుచో దుఃఖమును తెచ్చిపెట్టును. ప్రాణులకు గలుగు ఉత్తమాధమ మధ్యమగతులు, వారుచేసికొన్న కర్మవలననే కలుగును. ఇచట కర్మయనగా సంకల్పించుట, ఊహించుట, ధ్యానించుట, మాట్లాడుట, శరీరముతో వ్యవహరించుట మున్నగువాని కన్నింటికిని వర్తించును. కావున పవిత్రభావములు, పవిత్రసంకల్పములు, పవిత్రవాక్కులు, పవిత్రచేష్టలు అలవరచుకొనదగినవి. ఇందులకు కొన్నియుదాహరణములు:

పరద్రవ్యేష్వభిధ్యానం మనసాఽనిష్టచింతనం
వితథాఽభి నివేశశ్చ త్రివిధం కర్మమానసమ్ (12–5)

ఇతరులసొత్తును హరింపవలయునను ఆలోచన, పాపకర్మలను మనస్సుచే సంకల్పించుట, పరలోకము లేదనియు మనస్సే ఆత్మయనియు తలంచుట—ఇవి మూడు విధములైన మానసకర్మలు. ఇవి అశుభఫలమును గల్గించును. వీనికి వ్యతిరేకములైన మానసకర్మలు, అనగా పరులకు లాభమును కోరుట, పుణ్యకర్మలను చేయవలయునని సంకల్పించుట, పరలోకమున్నదనియు పరమేశ్వరుడున్నాడనియు నిశ్చయించుకొనియుండుట—ఇవి శుభఫలము నొసగు మానసికకర్మలు.

పారుష్యమనృతంచైవ పైశున్యం చాపిసర్వశః
అసంబద్ధప్రలాపశ్చవాఙ్మయంస్యాచ్చతుర్విధమ్. (12–6)

ఎదుటివానికి కష్టముగల్గునట్లుమాట్లాడుట, అసత్యము పల్కుట, చాటున ఇతరులపై కొండెములుచెప్పుట, అప

వసరముగ నితరుల గొడవలను చెప్పుకొనుట- ఇవి నాలుగు విధములయిన వాచికకర్మలు. వీనివలన అశుభమువచ్చును. మృదువుగామాట్లాడుట, సత్యమునే పల్కుట, పరుల సద్గుణములను ప్రశంసించుట, అనవసరప్రసంగములను విడిచిపెట్టుట ఇవి నాలుగును శుభఫలమును గల్గించు వాచికకర్మలు.

అదత్తానాము పాదానం హింసాచైవావిధానతః।
పరదారోప సేవాచ శారీరంత్రివిధం స్మృతమ్. (12-7)

ఇతరుల సొమ్మును అపహరించుట, వేదశాస్త్రానుమతిలేకుండ హింసగావించుట, పరస్త్రీ సంపర్కము- ఈమూడు విధములైన శారీరకర్మలు అశుభఫలమునిచ్చును. ఏతద్వ్యతిరిక్తకర్మలు శుభఫలము నొసగును.

మానసం మనసైవాయ ముపభుంక్తే శుభాశుభం।
వాచావాచాకృతంకర్మ కాయేనైవచకాయికం. (12-8)

మనస్సుచేత జేసిన పుణ్యపాపముల ఫలమును మనస్సుచేతనే అనుభవింపవలసియుండును. వాక్కుచేత చేసిన పుణ్యపాపకర్మల శుభాశుభ ఫలములనువాక్కుచేతనే అనుభవింపవలసియుండును. శరీరముచేతచేసినపుణ్యపాపకర్మల శుభాశుభ ఫలమును శరీరము చేతనే అనుభవింపవలసియుండును.

శరీరజైః కర్మదోషై ర్యాతి స్థావరతాంనరః।
వాచికైః పక్షిమృగతాంమానసైరంత్యజాతితాం. (12-9)

ఎవడు శరీరముచేత మిక్కుటమైన పాపములనుచేయునో వాడు తరుగుల్మలతాది జన్మనుపొందును. ఎవడువాక్కుచేత బహుళపాపములను చేయునో వాడు పశుపక్ష్యాది జన్మను పొందును. ఎవడు మనస్సుచేత హెచ్చుగా పాప

ములను చేయునో వాడు చండాలాది జన్మను పొందును. (స్త్రీలు పాపఫలముగా తిర్యగ్యోనులయందు జన్మించుచో స్త్రీత్వముతోనే జన్మింతురనిమనువు చెప్పుచున్నాడు.(12-69)

ఈజన్మలో అనుభవింపబడు రూపవైకల్యాదులకు కారణము ఈజన్మలోని పాపములైనను కావచ్చును, పూర్వ జన్మలోని పాపములైనను కావచ్చును.

ఇహదుశ్చరితైః కేచిత్కేచి త్పూర్వకృతై స్తథా
ప్రాప్నువన్తి దురాత్మానో నరారూప విపర్యయం. (11-48)

ఈరీతిగా పుణ్యకర్మలకు శుభఫలమును, పాపకర్మలకు అశుభఫలమును అనుభవింపవలసియుండును.

## మానవ జన్మ సార్థక్యము

ధర్మాచరణావకాశ ముండుట వలననే మానవ జన్మ శ్రేష్ఠమైనది.

భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః
బుద్ధిమత్సు నరాః శ్రేష్ఠాః నరేషు బ్రాహ్మణాః స్మృతాః.
బ్రాహ్మణేషు చ విద్వాంసో విద్వత్సుకృత బుద్ధయః
కృతబుద్ధిషు కర్తారః కర్తృషు బ్రహ్మవేదినః. (1-96,97)

స్థావర జంగమములలోకదలిక లేనివానికంటె కదలిక గలవి గొప్పవి. ఏకొలది సుఖమైనను వాని కప్పుడప్పు డనుభవములోనికి వచ్చును. (తరుగుల్మలతాదులకును సుఖదుఃఖానుభూతియున్నను అది ప్రకటము కాదని మనువు చెప్పె

యున్నాడు.) ఆ ప్రాణులలోను బుద్ధి నుపయోగించి సుఖము ననుభవింప గల్గు పశుపక్ష్యాదులు గొప్పవి. బుద్ధిగల యీ ప్రాణులలోను ధర్మాధర్మజ్ఞానముగల మనుష్యులు శ్రేష్ఠులు. వీరు ధర్మమునాచరించి సుఖము పొందగల్గుదురు. అధర్మమును వీడి దుఃఖమును తప్పించుకొన గలుగుదురు. ఆ నరుల లోను బ్రాహ్మణులు శ్రేష్ఠులు, బ్రాహ్మణులలోను ధర్మస్వరూపమును పూర్తిగా నెరిగిన విద్వాంసులు గొప్పవారు. అందునను వైదిక ధర్మమందు శ్రద్ధగలవారు ఘనులు. వారిలోను ఆ ధర్మము నాచరించువారు ఉత్కృష్టులు. ఆ యాచరించువారిలోను స్వర్గాది కామములతో ఆచరించువారికంటె మోక్షాపేక్షతో నిష్కామముగా నాచరించి బ్రహ్మజ్ఞానము పొందినవారు శ్రేష్ఠులు. కావున సర్వప్రాణులలోని శ్రేష్ఠత్వ మనునది ధర్మమునుబట్టియే నిర్ణయింపబడును.

కావునమానవజన్మ కల్గినపిమ్మటబుద్ధినుపయోగించిజ్ఞానము వలన పొందదగిన యానందమును పొందవలయును; శాస్త్రోక్తకర్మల నాచరించి స్వర్గాదిపుణ్యలోకములను, ఉత్తమజన్మలను పొందుటకు ప్రయత్నించవలయును. ఆశాస్త్రోక్తకర్మలనే నిష్కామముగా నాచరించి చిత్తశుద్ధిని, తద్ద్వారా మోక్షమునుపొందుటకు యత్నించుట అంతకంటెను ప్రశస్తమైనది.

బ్రాహ్మణు డితరులకంటె ఐహికభోగములను తక్కువగా ననుభవించి ఆముష్మికశ్రేయస్సాధనములను ఎక్కువగా నాచరింపవలయునని మనువు తాత్పర్యము.

బ్రాహ్మణస్యతు దేహోయం నోపభోగాయ కల్పతే
తపసే బహురూపాయ ప్రేత్యానంత సుఖాయచ.

బ్రాహ్మణ శరీరము భోగములకొఱకు తగదు. బహు విధములైన తపస్సులనుచేసి మరణానంతరము అనంతసుఖమును సంపాదించుకొనుటకు తగియున్నది. (పైనుదాహరింపబడిన 1-96 శ్లోకములోని బ్రాహ్మణశ్రేష్ఠ్యమునకిది కారణము.)

## మోక్షసాధనము.

యజ్ఞ దాన తపఃకర్మాత్మకమైన ధర్మము స్వర్గకాములకు మాత్రమేకాక మోక్షకాములకుకూడ అనుష్ఠేయమే యని భగవద్గీత చెప్పుచున్న యంశము మనుస్మృతిలోకూడ కనఁబట్టుచున్నది. ధర్మాచరణము మోక్ష ప్రతిబంధములను తొలగించును.

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని
సమంపశ్య న్నాత్మయాజీ స్వారాజ్యమధిగచ్ఛతి.(12-91

సర్వభూతములయందును, ఒకే ఆత్మయున్నదనియు, పరమాత్మయందే సర్వభూతములు నున్నవనియు గుర్తించుచు సర్వకర్మలను బ్రహ్మార్పణముగా చేయువాడు మోక్షమును పొందును. (ఇట్టిపట్ల వైదికకర్మ, యోగమగుచున్నది. అనగా బ్రహ్మప్రాప్తికుపాయమగుచున్నది).

వైదికే కర్మయోగేతు సర్వాణ్యేతాన్య శేషతః
అంతర్భవంతిక్రమశ స్తస్మిౝ స్తస్మిన్ క్రియావిధౌ(12.87

ఈకర్మయోగమందు, మోక్షఫలము మాత్రమే కాక ఐహికాముష్మిక శ్రేయస్సులన్నియు నిమిడి యున్నవి.

సుఖాభ్యుదయికం చైవ నైఃశ్రేయసిక మేవచ
ప్రవృత్తంచ నివృత్తంచ ద్వివిధం కర్మవైదికం (12-88)

వైదికకర్మ రెండువిధములు; ప్రవృత్తకర్మ, నివృత్త కర్మ. స్వర్గాది సుఖముల నిచ్చి సంసారములో నిలబెట్టునది ప్రవృత్తకర్మ, మోక్షమునిచ్చునది నివృత్తకర్మ.

ప్రవృత్తకర్మ స్వర్గాదివాంఛలతో చేయబడును, నివృత్తకర్మ మోక్షాభిలాషతో చేయబడును.

ఇహాచాముత్రవాకామ్యం ప్రవృత్తం కర్మకీర్త్యతే
నిష్కామంజ్ఞాన పూర్వంతు నివృత్తముప దిశ్యతే.(12-89)

ఈలోకములోకాని, స్వర్గాది లోకములలో కాని, సుఖము ననుభవింపవలయునను కోరికతోచేయబడు కర్మ ప్రవృత్తకర్మ యనబడును. నిష్కామముగాను, జ్ఞానాభ్యాస పూర్వకముగాను, ఆచరింపబడు కర్మ నివృత్తకర్మ మన బడును. (దీనికిని శ్రీశంకరులు వాడిన పరిభాషకును భేదము గుర్తింపదగినది. నిష్కామకర్మకు ప్రవృత్తి ధర్మమనియు, వైరాగ్యాదికమునకు నివృత్తిధర్మమనియు జగద్గురువులు వాడినపరిభాష)

ప్రవృత్తం కర్మ సంసేవ్య దేవానామేతిసామ్యతాం
నివృత్తం సేవ మానస్తు భూతాన్యత్యేతి పంచవై(12-90

ప్రవృత్తకర్మ నాచరించుటవలన సామాన్యమైన ఐహికాముష్మిక సుఖములు కలుగుటయేగాక దేవతలతో సమానత్వము కూడ కల్గును. నివృత్తకర్మ నాచరించువాడు తుదకు శరీరోత్పత్తికి కారణములైన పంచభూతములను అతిక్రమించును, అనగా మోక్షము పొందును.

ఇహపరలోక సుఖములను పొందుటకైనను నిత్యనిరతిశయానందాత్మకమైన మోక్షస్థితిని పొందుటకైనను ధర్మాచరణము సాధనమనునది నిష్కృష్టార్థము.



# ౨. సామాజిక వ్యవస్థ

ప్రపంచములో భారత దేశమునకు ప్రతిష్ఠ తెచ్చిన వానిలో మనుస్మృతి యొకటి. మానవులొకరిపట్ల నొకరవలంబింప వలసిన ప్రవర్తన విధానము మనుస్మృతిలో విపులముగా నిర్దేశింపబడి యున్నది. మృదుత్వము, దయ, ప్రేమ, సాత్వికత మున్నగు మహోన్నత గుణములతో మానవుల నుత్తేజింప చేయగల సమాజ మర్యాదా ప్రణాళిక మనువులో కనబట్టుచున్నది. ఏ కాలమువారికయినను, ఏ దేశమువారికయినను ఉపాదేయములైన యుపదేశము లిందు మిక్కుటముగా నున్నవి.

ప్రాచీన ధర్మాచార్యులు వ్యక్తులకొరకే ముఖ్యముగా ధర్మోపదేశము చేసినారు కాని సమాజము కొఱకు కాదు. అనగా సమాజమేదో నిర్దిష్ట స్థితిలోనికి వచ్చువరకు వ్యక్తులు తమ ధర్మమును నిర్వహింపనక్కఱలేని వ్యవస్థనుగాని, సమాజమునుమార్చుటకే వ్యక్తులు నిరంతరము కృషిచేయుచుండవలయునను సందర్భమును కాని ప్రాచీన ధర్మాచార్యులు సంకల్పింపలేదు. ఉత్తమ వ్యక్తులతో ఉత్తమ సమాజమేర్పడునను సిద్ధాంతముమీదనే వారి బోధలు సాగినట్లు కన్పించును. సమష్టివ్యవస్థ యుపేక్షింపబడినదని దీనియర్థముకాదు.

## ఎ వ్వ రి ని అ వ మా ని ం ప రా దు.

ఎవ్వరి మనస్సును నొప్పింపకుండుట సమాజ ధర్మము లలో మొదటిది. "ఎదుటివాడు బాధను కల్గించినను వాని పట్ల కఠినోక్తులను పల్కరాదు; వాని ప్రాణమును నొప్పింప రాదు. ఎవ్వరికిని ద్రోహముచేయు సంకల్పము పొందరాదు; ఇతరులకు తనవలన హానికల్గునను భయమును కల్గింప రాదు. ఈ యాదేశములకు విరుద్ధముగా ప్రవర్తించుట పుణ్య లోకప్రాప్తికి ప్రతిబంధకము."

నారుంతుదస్యా దార్తోపి న పరద్రోహకర్మధీః
యథాస్యోద్విజతేవాచా నాలోక్యాంతాము దీరయేత్ )
(2–161

అహింసయైవ భూతానాం కార్యం శ్రేయోనుశాసనం
వాక్చైవమధురా శ్లక్ష్ణా ప్రయోజ్యా ధర్మమిచ్ఛతా.
(2–159)

"ఎదుటివానికి లాభమును కలిగించు విషయము నుద్దేశించునపుడు కూడ వానికి బాధను కల్గింపకూడదు. మధుర వాక్కులతోనే చెప్పవలెను. వానిగుండె యదురు నట్లు చెప్పకూడదు."

"నేను వానిని అవమాన పరచివేసినాను, వీనిని సిగ్గు పరచివేసినాను" అని గర్వించువాడు వివేకహీనుడు. చివరకు నశించువాడు అవమానించిన వాడేకాని యవమానింప బడిన వాడు కాడని మనువు చెప్పుచున్నాడు.

సుఖం హ్యావమతః శేతేసుఖం చ ప్రతిబుద్ధ్యతే
సుఖం చరతిలోకేఽ స్మిన్నవమంతా వినశ్యతి. (2-163)

అవమానము పొందినవాడు సుఖముగా నిద్రపోవును, సుఖముగా తిరుగును అవమానించినవాడు పాపఫలము ననుభవింపకతప్పదు: తుదకు వాడే నశించును.

## ఎవ్వరిని ఆక్షేపింపకూడదు

జన్మాంతరమందు చేసికొన్న పాపమునకు ఫలితముగ ఈజన్మలో కలిగిన లోపములకు కాని, హైన్యమునకు కాని ఎవ్వరిని ఆక్షేపింపరాదు. వార్ధకముతో బాధపడువారిని కూడ ఆక్షేపింపరాదు.

హీనాంగా నతిరిక్తాంగాన్ విద్యాహీనాన్ వయోధికాన్
రూపద్రవ్యవిహీనాంశ్చ జాతిహీనాంశ్చనాక్షిపేత్ (4-141

"అవయవలోపము కలవారిని, అవయవాధిక్యము కలవారిని, విద్యావిహీనులను, వృద్ధులను, కురూపులను, దరిద్రులను, హీనజాతివారిని, ఆక్షేపింపకూడదు."

పదిమందిచేత "దాసోహం" మ్మనిపించుకొన వలెనను బుద్ధితో సమ్మానమును గోరుట నింద్యము.

సమ్మానాత్ బ్రాహ్మణో నిత్యముద్విజేతవిషాదివ. (2-162)

బ్రాహ్మణుడు విషమువల్లనుండివలె సమ్మానమునుండి భయపడవలెను.

బ్రాహ్మణుని నిమిత్తముగా చెప్పబడిన యిట్టి నియమములు అన్ని వర్ణములవారికిని వర్తించునని మనుస్మృతిలోనే మరొకచోట చెప్పబడినది. (10-123)

## పెద్దలపట్ల గౌరవము

ఆచార్యంచ ప్రవక్తారం పితరం మాతరం గురుం
నహింస్యాత్ బ్రాహ్మణాన్ గాశ్చ సర్వాంశ్చైవ తపస్వినః
(4-162)

ఉపనయనము చేసిన ఆచార్యుని, వేదార్థము చెప్పగల విద్వాంసుని, తల్లిని, తండ్రిని, గురువును, బ్రాహ్మణులను, తపస్వులను వ్యతిరేకించి వారిమనస్సులను నొప్పింపరాదు.

ఆచార్యశ్చ పితాచైవ మాతాభ్రాతాచ పూర్వజః
నార్తేనాప్యవమంతవ్యా బ్రాహ్మణేన విశేషతః
ఆచార్యో బ్రహ్మణోమూర్తిః పితామూర్తిః ప్రజాపతేః
మాతామూర్తిః పృథివ్యాస్తు భ్రాతాస్వోమూర్తిరాత్మనః
తయోర్నిత్యం ప్రియం కుర్యా దాచార్యస్య చ సర్వదా
తేష్వేవత్రిషు తుష్టేషు తపస్సర్వం సమాప్యతే.
తేషాంత్రయాణాం శుశ్రూషా పరమం తప ఉచ్యతే
నతైరనభ్యనుజ్ఞాతో ధర్మమన్యం సమాచరేత్.
(2-225, 26, 28, 29)

ఆచార్యుడు, తల్లి, తండ్రి, అన్న వీరు ఎన్నఁడును అవమానింప దగినవారు కారు. వారివల్ల బాధ కల్గినను వారినవమానింపరాదు. ఈ ధర్మము బ్రాహ్మణునకు మరింత ముఖ్యము. ఆచార్యుడు బ్రహ్మ; తండ్రి, ప్రజాపతి; తల్లి పృథివి; సోదరుడు తన స్వరూపము. తల్లి, తండ్రి, ఆచార్యుడు వీరి కెల్లప్పుడును సంతోషము గల్గింపవలెను వారి

వలన సర్వ శపస్సు చేసినట్లగును. వీరి యనుమతి లేకుండ ఏధర్మమును చేయరాదు.

ఒక్క జన్మలోని తలిదండ్రుల ఋణమున్ను తీర్చు కొనుటకైనను అనేక జన్మలు చాలవనియు, అంత క్లేశమును పుత్రుని కొరకు తలిదండ్రులు పడుదురనియు మనువు చెప్పుచున్నాడు.

యం మాతా పితరౌ క్లేశం సహేతే సంభవే నృణాం
నతస్య నిష్కృతి శ్శక్యా కర్తుం వర్ష శతైరపి. (2-227)

## పెద్దల సేవ

ఊర్ధ్వం ప్రాణాహ్యుత్క్రామంతి యూనః స్థవిర ఆగతే,
ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే (2-120)

వయో విద్యాదులచే అధికుడైనవాడు వచ్చుచుండగా చిన్నవానికి భయముచే ప్రాణములు పైకిపోవును. ఆయనకు ఎదురుగావెళ్ళి నమస్కరించిన తర్వాత యువకుడు తిరిగి ప్రాణములను పొందును.

అభివాదన శీలస్య నిత్యం వృద్ధోపసేవినః
చత్వారి పరివర్ధంతే ఆయుర్విద్యా యశోబలం (2-121)

పెద్దలకు నమస్కరించి సేవించువానికి ఆయువు, విద్య, యశస్సు, బలము వృద్ధిపొందును. (పెద్దలకు నమస్కరింప వలసిన పద్ధతి ఈ క్రింది విధముగా నున్నది.)

వ్యత్యస్త పాణినా కార్య ముపసంగ్రహణం గురోః
సవ్యేన సవ్యః స్ప్రష్టవ్యో దక్షిణేన చ దక్షిణః. (2-72)

గురువులకు వందనము చేయునప్పుడు వారి కుడిపాదమును తన కుడిచేతితోను, ఎడమ పాదమును ఎడమ చేతితోను స్పృశించుచు వందనము చేయవలయును. (తన కుడి చేయి పైగాను, ఎడమచేయి క్రిందుగాను ఉండునట్లు వారి పాదములవద్ద పడి పాదములను స్పృశించవలయును.)

విద్యాగురువునకే కాక తనకంటె పెద్దలగు బంధువులకును, విద్వాంసులకును, ఇతర మహానుభావులకును ఇట్లు నమస్కరింప వలయుననియును, నమస్కరించు నపుడు తన గోత్ర, ప్రవర, నామధేయములను చెప్పవలయు ననియు మనువు తెలుపుచున్నాడు.

మేనమామ, పినతండ్రి. ఋత్విక్కు మున్నగు బంధువులట్లు నమస్కరింపదగినవారు. తన కన్న చిన్నవారైనచో వారికి సగౌరవముగా నెదురేగవలయును, నమస్కరింపరాదు. నమస్కరింపదగినవారి భార్యలకెల్ల నమస్కారము చేయవచ్చును. స్త్రీల వయస్సు లెక్కలోనికిరాదు. వారి భర్తల వయస్సే వారి వయస్సుగా పరిగణింపబడినది. అన్న భార్య తనకంటె చిన్నదైనను నమస్కరింప దగినదే. అట్లే యితరుల విషయము. యువతులకు నమస్కరించునపుడు పాద స్పర్శ చేయకూడదు.

## వివాదము కూడనివారు

ఎవరితోను వివాదపడరాదు. కాని ముఖ్యముగా వివాదకారణమున్నను ఈక్రింది వారితో వివాదము పెట్టు

కొనరాదు: ఋత్విక్కు, పురోహితుడు, ఆచార్యుడు, మేనమామ, ఇంటికివచ్చిన అతిథి, బాలుడు, వృద్ధుడు, రోగి, వైద్యుడు, జ్ఞాతి, వియ్యంకుడు, బంధువు, తల్లిదండ్రులు, అక్క-చెల్లెండ్రు, అన్నదమ్ములు, పుత్రుడు, కుమార్తె, భార్య, సేవకుడు.

ఋత్విక్పురోహితాచార్యైర్మాతులాతిథి సంశ్రితైః
బాలవృద్ధాతురైర్వైద్యైః జ్ఞాతిసంబంధిబాంధవైః
మాతాపితృభ్యాం జామీభిర్భ్రాతా్రపుత్రేణ భార్యయా
దుహిత్రాదాసవర్గేణవివాదంనసమాచరేత్ (4-179,180)

## గురునిందను వినరాదు

తనగురువు నెవరయినను నిందించుచుండగా శిష్యుడా నిందను వినకూడదు. చెవులు మూసికొనవలయును. లేదా మరియొక స్థలమునకు వెళ్ళిపోవలయును. ఆనింద సహేతుకమైనను, అహేతుకమైనను నంతియే. అనగా గురువుగారిలో నిజముగా నున్న దోషములను కూడ ఎవరైనను ఉద్ఘాటింపఁగా వినకూడదు.

గురోర్యత్ర పరీవాదో నిందావాపి ప్రవర్తతే
కర్ణౌతత్రపిధాతవ్యౌ గంతవ్యంవాతతో౽న్యతః(2-200)

సమాజములో ఇతరులపట్ల సత్త్వగుణముతోను, సహనముతోను, సర్దుపాటు భావముతోను వర్తింపవలయు ననుట కింతకంటెను పెద్ద యుదాహరణ ముండదు.

## గౌరవాపాదకములు

సాధారణముగా మానవునకు గౌరవము కలిగించునవి యైదు. అందు ముఖ్యమైనది విద్య. ఆతరువాతిది కర్మాచరణము, పిమ్మట క్రమముగా వయస్సు, బంధువులు, ధనము.

విత్తం బంధుర్వయః కర్మ విద్యాభవతి పంచమీ
ఏతానిమాన్య స్థానాని గరీయో యద్యదుత్తరం(2-136)

## గొప్ప కుటుంబమన నేది?

ధనము అధికారముగల కుటుంబములకు ఉన్నత కుటుంబములని లోకములో వ్యవహారముండగా మనువు ఉన్నత కుటుంబమునకు మఱొకవిధమైన నిర్వచనమిచ్చుచున్నాడు. పారమార్థిక విజ్ఞానము, సుంతానుష్ఠానముగల్గి ధర్మమును పాటించు కుటుంబములే గొప్పవని మనువు చెప్పుచున్నాడు.

మంత్రతస్తు సమృద్ధాని కులాన్యల్ప ధనాన్యపి
కులసంఖ్యాంచ గచ్ఛంతి రక్షంతి చమహద్యశః(3-66)

సాధారణముగా లౌకికదృష్టిలో గొప్పస్థితిని పొందిన కుటుంబములతో వివాహసంబంధముచేయుట తమ్ము ఉన్నతస్థితికి గొనిపోవునని ప్రజలు తలంచుచుండగా మనువు పైని వర్ణించిన ఉన్నత కుటుంబములతో సంబంధము చేయుటయే కులోత్కర్ష సంపాదకమని చెప్పుచున్నాడు.

ఉత్తమై రుత్తమైర్నిత్యం సంబంధా నాచరేత్సదా
నినీషుఃకులముత్కర్ష మధమానధమాం స్త్యజేత్ (4-244)

## రోగి వృద్ధాదులపట్ల ప్రత్యేకాదరము

మార్గమందు రోగి యెదురుగా వచ్చుచో నాతడు పూజ్యుడు కానివాడైనను ఆతనికి దారినిచ్చి తప్పుకొనవలయును. స్త్రీకిని, తొంబది సంవత్సరముల వృద్ధునకును, బరువుమోయుచున్న వానికినికూడ సాదరముగా దారినీయవలయును. పెండ్లికుమారునకును, స్నాతకునకును, రథస్థునకును కూడ దారి నొసగవలయును.

చక్రిణో దశమీస్థస్య రోగిణో భారిణః స్త్రియాః
స్నాతకస్య చ రాజ్ఞశ్చ పంథా దేయో వరస్య చ. (2-138

## చాపల్యము కూడదు

తనకు సంబంధములేని ఇతరుల రహస్యములను చూడగోరుట, కాలుచేతులను వ్యర్థముగా ప్రసరింపజేయుచుండుట, అసందర్భముగా వాక్కు విసరుచుండుట—ఇత్యాదులను వీడవలయును. తిన్నని నడవడిక నలవరచుకొనవలయును. ఇతరులకు అపకారము చేయుతలంపును పొందరాదు.

నపాణి పాదచపలో ననేత్ర చపలోఽనృజః
నస్యాద్వాక్చపలశ్చైవ నపరద్రోహ కర్మధీః (4-177)

## జీవన సాధనములు

మానవులు జీవించుటకు పదివిధములైన పద్ధతులను మనువు అంగీకరించినాడు.

విద్యాశిల్పం భృతిః సేవా గోరక్ష్యం విపణిః కృషిః
ధృతిర్ భైక్ష్యం కుసీదంచ దశజీవన హేతవః (10-116)

వైద్యాదివిద్యలద్వారా బ్రతుకవచ్చును. శిల్పముచే జీవింపవచ్చును, జీతమునకు కుదరవచ్చును. సేవచే బ్రతుక వచ్చును. పశుపాలనము, వ్యవసాయముకూడ అవలంబింప దగినవే. బిచ్చమెత్తుకొనవచ్చును. వడ్డీవలన జీవింపవచ్చును. సంతోషమువలన జీవింపవచ్చును.(ఆదాయము తక్కువయినను సంతోషము ఆలోపమునుపూరించును) ఇవి ఆపత్కాలములో మాత్రమే ఆశ్రయింపవలసిన జీవనమార్గములు. సాధారణ సమయములలో నవలంబింపవలసిన మార్గములు ఆయా వర్ణములకు వేర్వేరుగానుండును.

## ధనాగమమార్గములు

ఆస్తికాని, ధనముకాని వచ్చుటకు ఏడుమార్గములను మను వంగీకరించినాడు:

సప్తవిత్తాగమాధర్మ్యా దాయోలాభః క్రయోజయః
ప్రయోగః కర్మయోగశ్చ సత్ప్రతిగ్రహ ఏవచ.(10-115

(1) వారస్వత్వముగావచ్చిన బంధుధనము (2) తన స్థలములోని గనులవలనకాని, మిత్రులవలన కాని లభించిన ధనము (3) కొనుక్కొనగా వచ్చినది (4) శత్రురాజును జయించి తీసికొన్నది, (5) వడ్డీ, (6) వాణిజ్యవ్యవసాయములు. (7) న్యాయమైన దానము గ్రహించుట.

## వడ్డీ వ్యాపారము

బ్రాహ్మణ, క్షత్రియులు వడ్డీవ్యాపారము చేయరాదు. ధనాభావముచేత బాధపడుచున్నవానికి ఉపకారము చేయుటకై ధనమును ఋణముగానీయవలసి వచ్చినప్పుడు తక్కువ వడ్డీకి ఋణమీయవచ్చును

బ్రాహ్మణః క్షత్రియోవాపి వృద్ధిం నైవ ప్రయోజయేత్
కామంతు ఖలు ధర్మార్థం దద్యాత్ పాపీయసేఽల్పికాం.
(10-117)

వైశ్యుడు మాత్రమే ధారాళముగా వడ్డీవ్యాపారము చేయుటకు అర్హుడు. అతడైనను ఎక్కువవడ్డీని తీసికొనరాదు. రాజు నిర్ణయించిన వడ్డీని మించి తీసికొనరాదు. రాజు వడ్డీ నిర్ణయించుటలో ప్రపంచములో అన్ని దేశముల మొత్తము మీద ధనమునకు ఆదినములలో ఎట్టివిలువ యున్నదో, ఎంత వడ్డీన్యాయ్యమైనదో తెలిసికొని నిర్ణయింపవలయును. సముద్రయానముచేయుచు, అయా దేశములను తిరుగుచు, దేశకాలార్థ పరిస్థితుల నెరిగినవారి వలన ఈ సంగతులను తెలిసికొనవలయును.

సముద్రయానకుశలా దేశ కాలార్థ దర్శినః
స్థాపయన్తితు యాం వృద్ధిం సాతత్రాధిగమం ప్రతి. (8-157

## అతిథిపూజ-అన్నదానము.

సంప్రాప్తాయత్వతిథయే ప్రదద్యాదాసనోదకే
అన్నంచైవయథాశక్తి సత్కృత్య విధిపూర్వకం. (3-99)

ఇంటికివచ్చిన అతిథికి పాదప్రక్షాళనమునకు నీరిచ్చి యాసనముమీద కూర్చుండబెట్టి శాస్త్రోక్తముగా పూజించి భోజనము పెట్టవలెను.

తృణాని భూమి రుదకం వాక్చతుర్థీచ సూనృతా
ఏతాన్యపిసతాంగేహే నోచ్ఛిద్యంతేకదాచన. (3-101)

సత్పురుషుల యిండ్లలో అతిథులకు విశ్రాంతిస్థానము దొరకకపోదు; ఉదకము, శయ్య లభింపకపోవు; తియ్యనిపలుకులు కూడ చెవిని పడకపోవు.

## పరాన్నభోజనము

ఒకని యింటికి అతిథిగా వెళ్లి భుజించు చుండుటయే హాయిగా నుండునని తలచి యేగృహస్థుడైనను ఎల్లప్పుడును పరాన్నభోజనమునే చేయుచో అది మిక్కిలి నింద్యము. ఆతడు అన్నదాతయింట పశువుగా జన్మించును.

ఉపాసతేయే గృహస్థాః పరపాక మబుద్ధయః
తేనతే ప్రేత్య పశుతాం వ్రజం త్యన్నాది దాయినాం

## స్వజనపోషణము ముఖ్యము

శక్తః పరజనే దాతా స్వజనే దుఃఖజీవిని
మధ్వాపాతో విషాస్వాదః సధర్మ ప్రతిరూపకః (11-9)

తన పితృ పుత్రికళత్రాదులు దుఃస్థితిలోనుండగా వారికై ధనమువెచ్చింపక ఇతరులకు దానముచేయుట పైకి ధర్మముగానే కనపట్టినను యథార్థముచేత అది అధర్మము. అదిపైకి తేనెవలె మంచిదిగా కనపట్టినను విషమువలె

హాని చేయును. ఆ దాత నరకమునకే పోవును. (స్వజనము దుఃఖములోనున్నచో వారికి సహాయపడవలెనని దీనియుద్దేశమేకాని స్వజనులకు భోగములను కూర్చుటకై యెల్ల దానములను కట్టిపెట్టవలయునని కాదు.)

## బ్రాహ్మణుని జీవయాత్ర

అద్రోహేణైవ భూతానా మల్పద్రోహేణ వాపునః
యావృత్తిస్తాం సమాస్థాయ విప్రో జీవేదనాపది (4–2)

ఎవ్వరికిని పీడను గల్గింపకుండ బ్రాహ్మణుడు ధనము సంపాదింపవలయును. భూస్వాములు తమ కక్కఱలేనిదిగా పొలములో విడచిపెట్టిపోయిన ధాన్యమును ఏరుకొనియు, అయాచితముగా వచ్చినదానిని తీసికొనియు జీవింపవచ్చును. అది సాధ్యముకానిచో ఎవరివద్దనైనను యాచించి తీసికొన్న దానితో జీవింపవలయును. (యాచింపగా ఇచ్చినవాడు తన ధనమును వీడునపుడు మనస్సులో కొంచెము బాధ ననుభవింపవచ్చును. కనుక ఇది రెండవ పద్ధతిగా అంగీకరింపబడినది. విద్య చెప్పి ధనము గ్రహించుటయు, యజ్ఞములను చేయించి దక్షిణలను తీసికొనుటయుకూడ బ్రాహ్మణున కంగీకరింపఁబడినవి.)

యాత్రామాత్ర ప్రసిద్ధ్యర్థం స్వైః కర్మభి రగర్హితైః
అక్లేశేన శరీరస్య కుర్వీత ధన సంచయం. (4–3)

శరీరధారణము, కుటుంబపోషణము, నిత్యకర్మానుష్ఠానము–మున్నగునవి స[illegible]వుట కవసరమైనంతవరకే బ్రాహ్మ

ణుడు ధనము సంపాదింపవలయును. భోగములకొరకు సంపాదింపరాదు. లోకముచే నింద్యములుకాని కర్మలచేతనే ఆతడు ధనము సంపాదింపవలయును. ధనార్జనము కొరకు ఇతరులను బాధపెట్టకూడదు. అట్లే తన శరీరమునుకూడ హెచ్చుగా బాధపెట్టరాదు.

న లోకవృత్తం వర్తేత వృత్తిహేతోః కథంచన,
అజిహ్మా మశఠాం శుద్ధాం జీవేద్బ్రాహ్మణజీవికాం(4-11

జీవికకొరకు బ్రాహ్మణుడు ఇచ్చకములాడి యొకరిని మెప్పించుట మున్నగు పనులలోనికి దిగరాదు. వక్రమార్గములను, దంభమును పూనరాదు. తనకులేని సద్గుణములున్నట్లు ప్రకటింపరాదు. స్వచ్ఛమైన బ్రాహ్మణ జీవికను ఆశ్రయింపవలయును.

సంతోషం పరమాస్థాయ సుఖార్థీ సంయతోభవేత్
సంతోషమూలంహిసుఖందుఃఖమూలంవిపర్యయః(4-12

కుటుంబపోషణమునకును పంచమహాయజ్ఞాది నిత్యకర్మానుష్ఠానమునకును అవసరమగు ధనముతో బ్రాహ్మణుడు సంతోషపడి నిగ్రహము కల్గియుండవలయును. అట్లుసంతోషపడక అధికధనముకొరకు యత్నించుచో పాపములు చేయవలసివచ్చును. దానివలన నరకప్రాప్తికల్గును. సంతోషము వలన స్వర్గాదిసుఖములు లభించును.

విధాతా శాసితావక్తా మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే
తస్మైనాకుశలం బ్రూయా న్నశుష్కాంగిర మీరయేత్. (11-85)

బ్రాహ్మణుడు ధర్మానుష్ఠానము చేసికొనుచు తన యధీనమునం దున్న వారికి ధర్మము నుపదేశించుచు విజ్ఞానము నితరుల కందించుచు సర్వభూతములయందు మైత్రిని కలిగి యుండవలయును, అట్టి బ్రాహ్మణుని గూర్చి కఠినోక్తులను పలుకరాదు; అమంగళముల నుచ్చరించరాదు.

## స్త్రీ గౌ ర వ ము

యత్రనార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః
యత్రైతాస్తు నపూజ్యన్తే సర్వాస్తత్రాఽఫలాఃక్రియాః.

స్త్రీ లెక్కడ పూజింప బడుదురో దేవత లక్కడ క్రీడింతురు; స్త్రీ లెక్కడ పూజింప బడరో అక్కడ ఎన్ని సత్కార్యములు జరిగినను అవి వ్యర్థములు.

పితృభి ర్భ్రాతృభిశ్చైతాః పతిభిర్దేవరై స్తథా
పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకళ్యాణ మీప్సుభిః.

తలిదండ్రులచేతను సోదరులచేతను భర్తలచేతను మఱదులచేతను స్త్రీలు పూజింపబడదగినవారు, భూషణము లచే అలంకరింపదగినవారు. శుభమును గోరు వారెల్లరును స్త్రీలను పూజించి భూషింపవలయును.

జామయోయాని గేహాని శపంత్య ప్రతిపూజితాః
తానికృత్యా హతానీవ వినశ్యంతి సమంతతః. 3-58

అక్కచెల్లెండ్రు పూజింప బడదగినవారు; వారు పూజింపబడనివారై శపించిన గృహములు దయ్యములచేత కొట్టబడినవి వలె నశించును.

## దాంపత్య ధర్మము

శ్లో॥ అన్యోన్యస్యాఽవ్యభిచారో భవేదామరణాంతికః
ఏషధర్మఃసమాసేన జ్ఞేయః స్త్రీపుంసయోస్సదా. 3-101

మరణపర్యంతము భార్యాభర్తలు వ్యభిచరింపకూడదు. సంగ్రహముగా చెప్పవలయునన్నచో నిదియే స్త్రీ పురుషుల యుత్కృష్టధర్మము.

శ్లో॥ సంతుష్టో భార్యయాభర్తా భర్త్రాభార్యా తథైవచ
యస్మిన్నేవ కులేనిత్యం కళ్యాణం తత్రవై ధ్రువం॥ 3-60

ఏ యింట భార్య భర్తతోను, భర్త భార్యతోను సంతుష్టితోనుందురో ఆయింట నిత్యము శుభము కల్గుచుండుట నిశ్చయము.

## సర్వవర్ణ సామాన్య ధర్మములు

అహింసా సత్యమస్తేయం శౌచమింద్రియ నిగ్రహః
ఏతం సామాసికం ధర్మం చాతుర్వర్ణ్యేఽబ్రవీన్ మనుః.

అహింస, సత్యము, పరద్రవ్యము నపహరింపకుండుట, పరిశుద్ధి, యింద్రియ నిగ్రహము ఇవి నాల్గు వర్ణముల వారికిని సంగ్రహముగా మనువుచే చెప్పబడిన ధర్మములు.

## దురభ్యాసములు

దశకామ సముత్థాని తథాష్టౌ క్రోధజానిచ
వ్యసనాని దురంతాని ప్రయత్నేన వివర్జయేత్. 7-45
మృగయాక్షోదివా స్వప్నః పరివాదః స్త్రియోమదః
తౌర్యత్రికం వృథాట్యాచ కామజో దశకోగణః 7-47

పైశున్యం సాహసం ద్రోహ ఈర్ష్యాసుయార్థ దూషణం
వాగ్దండజంచ పారుష్యం క్రోధజోపి గణోష్టకః 7–48

కామమువలన పుట్టిన దురభ్యాసములు పది. క్రోధము వలన పుట్టిన దురభ్యాసములు ఎనిమిది. కామము వలన పుట్టిన పది దురభ్యాసము లెవ్వి యన: వేట, జూదము, పగటి నిద్ర, పరదోషకథనము, పరస్త్రీ సంపర్కము, మద్య పానము, నృత్య గీతవాద్యిత్ర వ్యసనము, వ్యర్థముగాతిరుగుట.

క్రోధమువలన కలుగు ఎనిమిదిదోషము లెవ్వియన–

ఇతరులమీాద లేనిపోని నేరములు చెప్పుట,సాహసము, (సత్పురుషులను దండించుట,) కపటముగా అపకారము చేయుట, ఇతరుల గుణమును సహింపలేకపోవుట, ఇతరుల గుణములయందు దోషములను చూపుట, అర్థము నపహరించుట (ఇతరుల కీయవలసిన దాని నీయకుండుటకూడ), పర దూషణము, పరులను హింసించుట.

ఈ పదునెనిమిది వ్యసనములు ఎవ్వరికినితగవు, ప్రజా శాసకుడుగానున్న రాజునకు బొత్తిగా తగవు.

వ్యసనస్య చ మృత్యోశ్చ వ్యసనం కష్ట ముచ్యతే
వ్యసన్యధోధో వ్రజతి స్వర్యాత్యవ్యసనీమృతః 7–53

వ్యసనము, మృత్యువు–అనెడి రెండింటిలో వ్యసనమే చెడ్డది. వ్యసనములు కలవాడు క్రమముగా క్రిందికి పోవును. దురభ్యాసములు లేనివాడు మరణానంతరము స్వర్గాదిలోకములకేగును.

మ్యాతం సమాహ్వయం చైవ రాజా రాష్ట్రాన్నివారయేత్
రాజ్యాంతకరణా వేతౌ ద్వౌదోషౌ పృథివీక్షితాం 9-224

ప్రాణములేని పాచికలు మున్నగువానితో నాడబడు నది జూదము; కోళ్ళు, పొట్టేళ్ళు మున్నగు ప్రాణులతో కూడిన పందెములకు సమాహ్వయమని పేరు. రాజు జూదమును, సమాహ్వయమును తనరాష్ట్రములో లేకుండ చేయవలెను.

## రా జు

శ్లో॥ యస్య స్తేనః పురేనాస్తి నాన్యస్త్రీగో నదుష్టభాక్
నసాహసికదండఘ్నో స రాజా శక్రలోకభాక్. 8-386

ఏ రాజుయొక్క పట్టణమందు దొంగలేడో, పరస్త్రీగామిలేడో, చెడ్డవాక్కును పలుకువాడులేడో, చెడ్డపనులకు సాహసించువాడులేడో, ఇతరులను హింసించువాడులేడో ఆ రాజు ఇంద్రలోకమున కేగును.

అదండ్యాన్ దండయన్ రాజాదండ్యాంశ్చా ప్యదండయన్
అశోయసో మహదాప్నోతి నరకంచైవ గచ్ఛతి. 8–128

రాజు దండింపవలసినవారిని దండింపకపోయినను, దండింప కూడని వారిని దండించినను అపకీర్తిని, నరకమును పొందును. (రాజునకుపక్షపాతముండరాదు, కసియుండరాదు.)

నహిదండా దృతే శక్యః కర్తుం పాప వినిగ్రహః
స్తేనానాంపాపబుద్ధీనాంనిభృతం చరతాం క్షితౌ (9–263

దొంగలయొక్కయు, లోకములో స్వేచ్ఛగా సంచరించు నితర పాపుల యొక్కయు దండనము రాజునకు కర్త

వ్యము. దండింపకుండ చోరాది పాపులను నిగ్రహించుట శక్యము కాదు.

త్రైవిద్యేభ్యస్త్రయీం విద్యాం దండనీతిం చ శాశ్వతీం
ఆన్వీక్షికీం చాత్మవిద్యాం వార్తారంభాంశ్చ లోకతః.

రాజు పండితులనుండి వేదమును, పరంపరాగతమైన రాజనీతిని, తర్క శాస్త్రమును, వేదాంత శాస్త్రమును, వాణిజ్యవ్యవసాయాది శాస్త్రములను అభ్యసించవలెను.

ఇంద్రియాణాం జయే యోగం సమాతిష్ఠేద్దివానిశం
జితేంద్రియో హి శక్నోతి వశేస్థాపయితుం ప్రజాః(7-44)

రాజు రేయింబవలు ఇంద్రియ జయమును అభ్యసించవలెను. ఇంద్రియ జయము కలవాడు ప్రజలను వశమందుంచుకొనుటకు సమర్థుడగును.

రాజు తన రాష్ట్రములో నున్న శ్రోత్రియుని (వేద శాస్త్రాధ్యయనము చేసిన అనుష్ఠానపరుని) ఆదరముతో చూడవలెను. ఆతని విద్యను, ప్రవర్తనను తెలిసికొని యాతనికి ధర్మసమ్మతమైన జీవితమును కల్పించవలెను. తండ్రి కుమారుని రక్షించునట్లాతనిని చోరాదులనుండి రక్షింపవలెను.

ఈరీతిగా శ్రోత్రియుడు రాజుచే రక్షింపబడినవాడై యే ధర్మమును నిత్యము చేయుచున్నాడో దానిచేత రాజు యొక్క ఆయువు, ధనము, రాజ్యము వృద్ధినొందును.

శ్రుతవృత్తే విదిత్వాస్య వృత్తిం ధర్మ్యాం ప్రకల్పయేత్
సంరక్షేత్సర్వతశ్చైనం పితా పుత్రమివౌరసం. (7-135)

సంరక్షమాణో రాజ్ఞాయం కురుతేధర్మ మన్వహం
తే నాయు ర్వర్ధ తే రాజ్ఞో ద్రవిణంరాష్ట్రమేనచ (7-136)

రాజునకు రాగద్వేషము లుండకూడదనియు, దయా దాక్షిణ్యము లుండవలెననియు గుర్తింపవలెను.

సర్వేషాంతు విదిత్వేషాం సమాసేన చికీర్షితం
స్థాపయేత్తత్ర తద్వంశ్యం కుర్యాచ్చ సమయక్రియాం.
జిత్వాసంపూజయేద్దేవాన్ బ్రాహ్మణాం శ్చైవధార్మికాన్
ప్రదద్యాత్ పరిహారాంశ్చ ఖ్యాపయేద భయానిచ(7-201

రాజు తాను జయించిన రాష్ట్రములో మంత్రులు మున్నగువారి అభిప్రాయములను బాగుగా తెలిసికొని ఆ జయింపబడిన రాజుయొక్క వంశస్థుని రాజ్యమునకు పట్టాభిషిక్తుని చేయవలెను.

తాను జయించిన రాజ్యములోనున్న ముఖ్యాలయములలోని దేవతలను, ధార్మికులైన బ్రాహ్మణులను పూజించి యుద్ధములో కలిగిన నష్టములకుగాను ఆ దేశస్థులకు పరిహారము నొసగి అదివరకు రాజభక్తిచేత ఎవరు యుద్ధము చేసినారో వారికి అభయము నొసగవలెను. (తనతోయుద్ధము చేసినవారిని దండించకూడదు.)

రాజెన్నడును కపటముగా వ్యవహరింపగూడదు. శత్రువులుతనపట్ల ప్రయోగించుమాయనుమాత్రము రహస్యముగా తెలిసికొనుచు దానికి ప్రతీకారము చేసికొను చుండవలెను.

అమాయయైవవ ర్తేత నకథంచన మాయయా
బుద్ధ్యేతారిప్రయుక్తాంచ మాయాం నిత్యం స్వసంవృతః.

రాజు యుద్ధమునకు సిద్ధముగాలేని శత్రువు నెన్నడును కొట్టరాదు. యుద్ధాభిముఖుడైన వానినికూడ కపటాయుధములచే కొట్టరాదు.

నకూటైరాయుధైర్హన్యా ద్యుధ్యమానో రణేరిపూన్
నకర్ణికాగ్రైర్నా పిదిగ్ధైర్నాగ్నిజ్వలితతేజనైః 7-90

రాజు యుద్ధమందు శత్రువునుకపటాయుధములచేతను (పైకి కొయ్యముక్కలవలె కన్పట్టి లోపల వాడియైన శస్త్రములుగల ఆయుధములచేతను) కర్ణికారములతో గూడిన (కొండగోగుతో గూడిన) బాణములచేతను, మంటలనురేపు బాణములచేతను విషముతో కూడుకొన్న బాణములచేతను కొట్టకూడదు.

బలవంతుడు బలహీనునివద్ద బలాత్కారముగా నేదైన తీసికొన్నచో దానిని రాజుచెల్లనీయకూడదు. బలవంతుడు బలహీనుని భూమి నాక్రమించుకొని సస్యము ననుభవించినను, ఆయనుభవింపబడిన పంటను భూమినికూడ రాజు ఆబలహీనున కిప్పింపవలయును. బలవంతముగా వ్రాయించుకొన్న అన్యాయము లయినఋణపత్రాదులను రాజు చెల్లనీయకూడదు.

బలాద్దత్తం బలాద్భుక్తం బలాద్యచ్చాపి లేఖితం
సర్వాన్ బలకృతా నర్థానకృతాన్ మను ర(బవీత్.7-168

ఈ రీతిగా రాజు దుర్బలులకు బలముగా నుండవలయును.

## సమష్టిదృష్టి

సంకుచితదృష్టికంటె విశాలదృష్టి ప్రశస్తమని మనువు చెప్పుచున్నాడు. కులక్షేమముకొరకు ఒకవ్యక్తిని విడువవచ్చు ననియు, గ్రామక్షేమము కొరకు గ్రామమును విడువ వచ్చు ననియు' పరమాత్మ కొఱకు ప్రపంచమునే విడువవచ్చు ననియు మనువు నుడువుచున్నాడు.

త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థేకులంత్యజేత్
గ్రామంజనపదస్యార్థే ఆత్మార్థే పృథివీంత్యజేత్.

మానవుని దృష్టి యెంత విపులమైన ప్రజాసీకముపై ప్రసరించిన నంత ప్రశస్తమనియు, పరమాత్మాన్వేషణమునకు ప్రపంచదృష్టి యడ్డురాకూడదనియు దీనితాత్పర్యము. అంతి యేకాని పదిమందికి లాభముగల్గుటకై యొక్కని బలియొసగ వచ్చుననికాదు, మాతాపితృపోషణము, పాతివ్రత్యము మున్నగు కొన్ని నిర్దిష్ట ధర్మములకు ఈ సామాజికదృష్టి భంజకము కాకూడదని మనువు స్థలాంతరమున స్పష్టపరచి యున్నాడు.

ధనము సంపాదించుకొనజాలని స్థితిలో నున్నవారికిని, ధర్మకార్యములకు ధనము నపేక్షించువారికిని, బాధలో నున్న వారికిని ధనరూపమైన సహాయము చేయుట సమాజము యొక్క ధర్మము.

సాంతానికం యక్ష్యమాణ మధ్వగం సర్వవేదసం
గుర్వర్థం పితృమాత్రర్థం స్వాధ్యాయార్థ్యుప తాపినః

నగ్నై తాన్ స్నాతకాన్ విద్యాద్బ్రాహ్మణాన్ ధర్మభిక్షుకాణ్
నిస్స్వేభ్యో దేయ మే తేభ్యో దానం విద్యా విశేషతః11-12

వివాహమాడ గోరువాడు, యజ్ఞముచేయగోరువాడు, మార్గస్థుడు, సర్వధనము దక్షిణగా యజ్ఞములో నిచ్చివేసిన వాడు, గురువుగారికి దక్షిణ నొసగ గోరువాడు, తల్లిదండ్రులను పోషింపవలసినవాడు, బ్రహ్మచర్యాశ్రమములోనుండి వస్త్రాద్యావశ్యక వస్తువులను కోరువాడు, రోగి-ధనహీనులైన యీ తొమ్మండుగురును దానము పొందుటకు ముఖ్యముగా అర్హులు. వీరిలోని విద్యావిశేషమునుబట్టి దానాధిక్య ముండ దగును.

మనువు దానముచేయుట ననేకస్థలములలో ప్రశంసించి యున్నాడు. ఎట్టివారు దానముపొందుటకర్హులో కూడ చెప్పినాడు. దీనులపట్లను, అనాథులపట్లను పక్షపాతము ఎల్ల యెడలను కన్పట్టును.

గర్భిణీతు ద్వి మాసాది స్తథా ప్రవ్రజితో మునిః
బ్రాహ్మణాలింగిన శ్చైవ నదాప్యాస్తారికం తరే.(8-407)

నదుల రేవులను దాటునపుడు ఈయవలసిన డబ్బునకు తారికమని పేరు. ఈతారికమును తీసికొనకుండగనే నావికుడు గర్భిణీస్త్రీని రేవు దాటించవలయును. (రెండుమాసముల గర్భవతి యైనస్త్రీ తారికము నీయనక్కరలేదు.) బ్రహ్మచారులు, వానప్రస్థులు, సన్యాసులు, బ్రాహ్మణులుకూడ తారికము నీయనక్కరలేదు.

ఇట్టి సందర్భము లన్నింటిలోను కన్పట్టుభావములు రెండు (1) ధనార్జనమున కవకాశము లేనివారిపట్ల ఉదార దృష్టిని వహింపవలయును (2) ఆర్తిలో నున్నవారికి సహాయముచేయుట పరమ కర్తవ్యము.

ఆర్థికాది కారణములచేత తమయింట వంటచేసికొని భుజింపజాలని వారికి యథాశక్తిగా గృహస్థుడు అన్నము పెట్టవలయునని మనువు చెప్పుచున్నాడు.

శక్తితో పచమానే భ్యో దాతవ్యంగృహమేధినా(4-32)

ధనసేకరణమునకు అందరికంటె ఎక్కువ అవకాశములుగల వైశ్యుని ధర్మమును నిర్దేశించుచు మను విట్లు చెప్పుచున్నాడు.

ధర్మేణద్రవ్య వృద్ధా వాతిష్ఠేద్యత్నముత్తమం
దద్యాచ్చసర్వ భూతానా మన్నమేవప్రయత్నతః(9-333)

వైశ్యుడు ధర్మబద్ధమైన పద్ధతిలో ధనమును వృద్ధి చేసికొనుచుండ వలయును. ఎల్లరకును అన్నదానము చేయుటకు యత్నించుచుండవలయును. ధనము నిచ్చుటకంటె ఆహారమునిడుట మంచిదని యెరుంగవలయును.

ఆయా వర్ణములవారికి విధింపబడిన వృత్తులు చివరకు సార్వజనిక క్షేమకరము లనునది చాలదు. పద్యః కాలములో ప్రతిమానవుడును సార్వజనికదృష్టితో వ్యవహరించుచుండ వలయునని యీ దేశము, వైశ్యునకు విశేషముగా

విధింపబడిన యీ యన్నదానము సర్వవర్ణగృహస్థులకుకూడ విధింపబడినది.

సమాజక్షేమమునకు వ్యతిరేకముగా దుష్టచర్యలు గావించు వారిని మనువు ఆతతాయి శబ్దముచే వ్యవహరించి అట్టిఆతతాయి బ్రాహ్మణుడైనను, బాలుడైననుకూడ సంహరింపదగినవాడే యని చెప్పుచున్నాడు. (8-350) రాజోద్యోగములోనుండి కార్యార్థులైన ప్రజలనుండి లంచములను తీసికొనువారిని సమాజద్రోహులనుగా మనువు గణించినాడు. మరియు ప్రజలను భయపెట్టి ధనము లాగుకొనువారు, జూదరులు, మోసగాండ్రు, ధనప్రాప్తి, సంతానప్రాప్తి మున్నగువానివి గురించి ప్రజలకు భవిష్యత్తును చెప్పువారు, పైకి కల్యాణవేషములను వేసికొని పాపములను కప్పుకొనువారు, రేఖాసాముద్రికముచూచి చెప్పువారు, గజశిక్షలోను, వైద్యములోను జీవితము గడుపుచు ఆవిద్యలో ప్రావీణ్యము లేనివారు, ఆరితేరిన వేశ్యలు- వీరివలన ప్రజలు నష్టపోకుండునట్లు చూచుట రాజువిధియని మనువు నుడువుచున్నాడు.

ఉత్కోచకా శ్చౌపధికా వంచకాః కితవాస్తథా
మంగళా దేశవృత్తాశ్చ భద్రాశ్చేక్షణికైస్సహ. (9-258)
శ్రద్ధయేష్టంచ పూర్తంచ నిత్యం కుర్యాదతంద్రితః
శ్రద్ధాకృతేహ్యక్షయేతే భవతః స్వాగతైర్ధనైః. 4-226

నిత్యము ఇష్టాపూర్తములను శ్రద్ధతో నాచరింపవల యును. న్యాయార్జితమైన ధనముతో శ్రద్ధగా చేయబడిన ఇష్టాపూర్తములు మోక్షఫలము నొసగును.

దేవతలకు తృప్తిని గల్గించు కర్మలకు ఇష్టములనియు, మానవ సమాజమునకు సుఖమును గల్గించు కార్యములకు పూర్తములనియు పేర్లు వేదములలోనే కన్పట్టుచున్నవి. ఈ పరిభాష మనువులోను కన్పట్టుచున్నది. ప్రజాసామాన్యము కొరకు తోటలను వేయించుట, వాపీకూప తటాకాదులను త్రవ్వించుట మున్నగు పౌర్తికకర్మలను ఐష్టికములతోబాటు విధించుటవలననే మనువు సమాజసేవ కెట్టి స్థానము నిచ్చి నాడో తెలియగలదు.

దానధర్మం నిషేవేత నిత్యమైష్టిక పౌర్తికం.(4-227)



# ౩. ఆచారము

విపులకర్మకలాపముతో కూడుకొనని అనుష్ఠేయాంశములకు ఆచారశబ్దమీ ప్రకరణమున వాడబడుచున్నది. ఆచారము విధిరూపముగానైనను, నిషేధరూపముగానైనను ఉండవచ్చును.

ఆచారప్రాముఖ్యమెట్టిదనః—

ఆచారాద్విచ్యుతో విప్రోన వేదఫలమశ్నుతే
ఆచారేణతు సంయుక్తః సంపూర్ణఫలభాగ్భవేత్. (1-169

ఆచారమునుండి జారిపోయిన బ్రాహ్మణుడు వేదాధ్యయనము చేసినను దానిఫలమును సరిగా పొందజాలడు. ఆచారముతోకూడినవాడు పూర్ణఫలమును పొందును.

అనభ్యాసేన వేదానామాచారస్య చవర్జనాత్
ఆలస్యాదన్నదోషాచ్చమృత్యుర్విప్రాన్ జిఘాంసతి(5-4)

సాధారణముగా మృత్యువు బ్రాహ్మణులను పట్టుకొనుటకు సాహసింపదు. కాని వేదాధ్యయనము మానివేయుట వలనను, కర్తవ్యముపట్ల సోమరితనమువలనను ఆచారములను వీడుటవలనను, ఆహారదోషమువలనను వారినిమృత్యువు మ్రింగగోరుచున్నది.

ఇచట ఆచారములేనిచో వేదాభ్యాసము, బ్రాహ్మణత్వముకూడ తేజస్సును కోల్పోవుననులనుబట్టి ఆచారము బ్రాహ్మణులకు మాత్రమే విహితమని తలంపరాదు, అన్ని వర్ణములవారును ఆచారములను పాటింపవలసినదే. ప్రత్యేకముగా నాయావర్ణములకు నిషేధింపబడిన ధర్మములుతప్ప మిగిలినవి బ్రాహ్మణుల నుద్దేశించి చెప్పబడిననుకూడ నితరులాచరింపదగినవేయని మనువు చెప్పియున్నాడు.

ధర్మేప్సవస్తు ధర్మజ్ఞాస్సతాం వృత్తమనుష్ఠితాః
మంత్రవర్జ్యంన దుష్యన్తి ప్రశంసాంప్రాప్నువన్తిచ(10-127

ఏశూద్రులు ధర్మమును తెలిసికొన్నవారై తమకు ప్రత్యేకముగా నిషేధింపబడనట్టియు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు విధింపబడినట్టియు, కర్మల నాచరింపగోరుదురో, అట్టివారు దోషమును పొందరు. పైగా స్తుతింపబడుదురు. ఎట్లన శూద్రులుకూడ నమస్కారమంత్రసహితముగాను, ఇతర మంత్రరహితముగాను పంచమహాయజ్ఞములను ఆచరింపవలయును. అట్లే యితరధర్మములను గురించి తెలియనగును.

యదాయదాహిసద్వృత్త మాతిష్ఠత్యనసూయకః
తథాతథేమంచాముంచలోకం ప్రాప్నోత్యనిందితః(10-128

శూద్రుడు ఇతరులను నిందింపనివాడై ద్విజుల మంచి యాచారముల ననుష్ఠింపవచ్చును. అట్లనుష్ఠించుచో నాతడు నిందార్హుడు కాడు, పైగా ఇహపరసౌఖ్యములను పొందగల్గును.

## సామాన్యముగా గృహస్థులు పాటింపవలసిన కొన్ని యాచారములు.

క్లృప్తకేశనఖశ్మశ్రుర్దాంతః శుక్లాంబరశ్శుచిః ।
స్వాధ్యాయేచైవయుక్తః స్యాన్నిత్యమాత్మహితేషుచ.

గృహస్థుడు తెల్లనివస్త్రములను ధరింపవలయును, పరిశుభ్రముగా నుండవలయును. అప్పుడప్పుడు వ్రతాదుల కవసరమయిన ఉపవాసములు స్నానములు మున్నగువానిని తట్టుకొనగల శారీరమానసికశక్తిని గల్గి యుండవలయును. కారణము లేకుండ గోళ్ళను గడ్డమును, మీసమును పెరగనీయకూడదు. వేదాభ్యాసమును వీడరాదు. ఆధ్యాత్మికచింత గల్గి యుండవలయును.

నేక్షేతోద్యంతమాదిత్యం నాస్తం యంతంకదాచన
నోపసృష్టంచ నారిస్థం నమధ్యం నభసో గతమ్. (4-37

ఉదయించుచున్న సూర్యుని, అస్తమించుచున్న సూర్యుని చూడకూడదు. గ్రహణము పట్టినపుడుకూడ సూర్యుని చూడరాదు, మధ్యాహ్నసమయమున నెత్తిపైనున్నపుడుకూడ చూడరాదు. నీటిలో ప్రతిబింబించినసూర్యుని చూడరాదు.

నలంఘయేద్వత్సతంత్రీం న ప్రధావేచ్చవర్షతి।
నచోదకేనిరీక్షేత స్వంరూప మితిధారణా. (4-38)

దూడను కట్టినత్రాటిని దాటరాదు, వర్షములో పరుగెత్తరాదు, నీటిలో తన ప్రతిబింబమును చూచుకొనరాదు.

రజసాభి ప్లుతాంనారీం నరస్యహ్యుపగచ్ఛతః।
ప్రిజ్ఞా తేజోబలం చక్షురాయుశ్చైవప్రిహీయతే (4-41)
నో పగచ్ఛేత్ప్రమత్తోపిస్త్రియ మార్తవదర్శనే
సమానశయనేచైవ నశయీాతతయాసహా. (4-40)

బహిష్ఠయైనస్త్రీని పొందకూడదు, పొందువానికి ప్రజ్ఞ నశించును, తేజస్సు, బలము, చూపు, ఆయువుకూడ నశించును.

నాశ్నీయాద్భార్య యాసార్థంనైనామీక్షేతచాశ్నతీం
క్షువతీం జృంభమాణాం వానచాసీనాం యథాసుఖం(4-43)

భార్యతోకలసి భోజనము చేయరాదు. భార్యభోజనము చేయుచున్నపుడామెను చూడకూడదు. ఆవులించునపుడు, తుమ్మునపుడు, స్వేచ్ఛగా విశ్రాంతికై కూర్చున్నపుడుకూడ ఆమెను చూడరాదు.

నాన్నమద్యాదేకవాసా ననగ్నః స్నానమాచరేత్ ।
నమూత్రంపథికుర్వీత నభస్మనినగోవ్రజే. (4-45)

పైబట్టలేకుండ భోజనము చేయరాదు. వస్త్రవిహీనుడై స్నానముచేయరాదు. (నిద్రపోరాదనికూడ స్థలాంతరమునకలదు.) నలుగురు నడచుదారిలో, భస్మములో, గోశాలలో మూత్రపురీషమును విడువరాదు.

నఫాలకృష్టేనజలేన చిత్యాంనచ పర్వతే।
నజీర్ణదేవాయతనే న వల్మీకేకదాచన.
నససత్వేషుగర్తేషు నగచ్ఛన్నపిచస్థితః।
ననదీతీరమాసాద్యనచ పర్వతమస్తకే.

నసస త్త్వేషు గర్తేషు నగచ్ఛన్నపిచస్థితః ।
ననదీతీరమాసాద్యనచ పర్వతమస్తకే.
వాయ్వగ్ని విప్రమాదిత్యమపః పశ్యంస్తథైవగాః
నకదాచనకుర్వీత విణ్మూత్రస్య విసర్జనమ్
తిరస్కృత్యోచ్చరేత్కాష్ఠం లోష్టపత్రతృణాదినా।
నియమ్య ప్రయతో వాచం సంవీతాంగోవ గుంఠితః
మూత్రోచ్చార సముత్సర్గం దివా కుర్యాదుదఙ్ముఖః
దక్షిణాభి ముఖో రాత్రౌ సంధ్యయోశ్చ యథాదివా.
ప్రత్యగ్నిం ప్రతిసూర్యంచ ప్రతిసోమోదక ద్విజాన్ ।
ప్రతిగాం ప్రతివాతంచ ప్రజ్ఞానశ్యతి మేహతః.
(4–46, 47, 48, 49, 50, 52)

పొలములోను, నీటిలోను, అగ్నిహోత్రము కొరకేర్పరుపబడిన చితిలోను, పర్వత శిఖరాగ్రమునను జీర్ణదేవాలయములోను, పుట్టలోను, పురుగు పుట్టకల నెరదలలోను, బొరియలలోను, నదీతీరమందును, మూత్రపురీషోత్సర్జనము చేయరాదు. నడచుచుకాని నిలువబడికానికూడ చేయరాదు.

అగ్నిని, బ్రాహ్మణుని, వాయువుచే కదలు చెట్లను సూర్యుని, నీటిని, గోవులను చూచుచు మూత్రపురీషోత్సర్జనము చేయరాదు.

మూత్రపురీషోత్సర్జన సమయమున మాట్లాడరాదు. శరీరమును శిరస్సును వస్త్రముచే కప్పుకొనవలయును. ఎంగిలి

తోనుండరాదు. ఎండుకట్టెలతోకాని ఎండుగడ్డితోకాని,మట్టి పెల్లలతోకాని, ఆప్రదేశమును కప్పవలయును.

పగటిపూట మల మూత్రములను ఉత్తరాభిముఖుడై విడువవలయును; రాత్రి దక్షిణాభిముఖుడుగా నుండవలయును. సంధ్యలయందు పగటియందువలెనే ఉత్తరాభిముఖముగా నుండవలయును. (సంధ్యాసమయములలో మూత్రపురీషోత్సర్జనము చేయకూడదను నిషేధమును ఈశ్లోకముతుడిచిపెట్టదు. నిషేధమున్నను ఒకవేళ తప్పనిసరిగ చేయవలసివచ్చుచో ఉత్తరాభిముఖుడుగ చేయవలయుననిభావము)

అగ్నికిని, సూర్యునకును, చంద్రునకును, నీటికిని బ్రాహ్మణునకును, గోవునకును, గాలికిని ఎదురుగాఉత్సర్గము చేయువానికి ప్రజ్ఞనశించిపోవును. కావున అట్లు చేయరాదు.

మృదంగాం దైవతం విప్రంఘృతం మధుచతుష్పథం ।
ప్రదక్షిణాని కుర్వీత ప్రజ్ఞాతాంశ్చవనస్పతీన్.(4—39)

ప్రయాణముచేయుచున్న సమయములో దేవతావిగ్రహము, గోవు, త్రవ్వి కుప్పవేయబడినమన్ను, బ్రాహ్మణుడు, నేయి, తేనె, చతుష్పథము, సువిఖ్యాతవృక్షము కన్పట్టుచో ప్రదక్షిణము చేయవలయును:

నాగ్నింముఖేనోపధమేన్న గ్నాంనేక్షేతచస్త్రియం ।
నామేధ్యం ప్రక్షిపేదగ్నౌనచపాదౌప్రతాపయేత్.(4—53

నిప్పును నోటితో ఊదకూడదు; వస్త్రరహితమైనస్త్రీని చూడకూడదు. అమేధ్యమును అగ్నిలోవేయరాదు. కాళ్లను నిప్పుతో కాచుకొనరాదు.

అధస్తాన్నోపదధ్యాచ్చ నచైన మభిలంఘయేత్
న చైనంపాదతః కుర్యాన్నప్రాణాబాధమాచరేత్ (4-54

మంచముక్రింద నిప్పుకుంపటి నుంచరాదు. నిప్పును దాటకూడదు. పండుకొని కాళ్ళదిక్కున నిప్పు నుంచుకొనరాదు. ప్రాణమునకు బాధతెచ్చు పనిని చేయరాదు.

నాశ్నీయాత్సంధివేళాయాం నగచ్ఛేన్నాపి సంవిశేత్ ।
నచైవ ప్రలిఖేద్భూమిం నాత్మనోపహరేత్స్రజం. 4-55

సాయంప్రాతస్సంధ్యాసమయములలో ఆహారము తీసికొనరాదు; ఎక్కడికిని వెళ్ళకూడదు; ఊరక గీతలుగీయరాదు; తనమెడలోని పూలదండను తానేతీసివేయకూడదు. (ఎవరిచేతనైనను తీయించుకొనవలయును )

నైకః సుప్యాచ్ఛూన్యగేహే శ్రేయాంసంనప్రబోధయేత్
నోదక్యయాఽభిభాషేతయజ్ఞం గచ్ఛేన్నచావృతః. 4—57

పాడుపడినయింటిలో ఒక్కడును నిద్రింపరాదు. తనకంటె గొప్పవారిని నిద్రనుండి సాధారణముగా లేపరాదు. బహిష్ఠస్త్రీతో మాట్లాడరాదు, యజ్ఞమునకు ఋత్విక్కుగా నుండవలసినదని ఆహ్వానింపబడకుండ ఆర్త్విజ్యాశతో వెళ్ళరాదు. (యజ్ఞమును దర్శించుటకు పిలుపు అక్కరలేదు.)

నవారయేద్గాంధయన్తీం నచాచక్షీతకస్యచిత్ ।
నదివింద్రాయుధం దృష్ట్వాకస్య చిద్దర్శయేద్బుధః.

ఆవుదూడ పాలుకుడుచుకొనుచుండగా అడ్డకూడదు; ఎవరికిని చెప్పకూడదు. ఆకాశమునుమీద ఇంద్రధనుస్సును చూచి యింకొకరికి చూపకూడదు.

నభుంజీతోద్ధృతస్నేహంనాతిసౌహిత్యమాచరేత్
నాతిప్రగే నాతిసాయం నసాయం ప్రాతరాశితః,

తెలకపిండి తినకూడదు. ఆహారమును ఎక్కువగా తినకూడదు. (జఠరములో సగముమాత్రమే ఆహారమును నింపవలయును, నాల్గవవంతును నీటితో నింపవలయును. మిగిలిన నాల్గవభాగమును వాయుసంచారమునకు విడిచిపెట్ట వలయునని విష్ణుపురాణము చెప్పుచున్నది) సూర్యోదయ సూర్యాస్తమయములయందు భోజనము చేయరాదు. ఉద యము ఎక్కువగా తిన్నచో సాయంకాలభోజనము మాన వలయును.

నకుర్వీత వృథాచేష్టాం నవార్యంజలినాపిబేత్।
నోత్సంగేభక్షయేద్భక్ష్యాన్నజాతు స్యాత్కుతూహలీ.4–63

వ్యర్థమైనపనులు చేయరాదు. (అనగా తాను చేయు పని ధర్మమునకో ధర్మవిరుద్ధములు కాని అర్థకామములకో ఉపయోగించునదిగా నుండవలయును) అంజలితో నీరు త్రాగరాదు. ఏవస్తువును ఒడిలోపెట్టుకొని తినరాదు. తన కక్కరలేని విషయములను తెలిసికొనవలయునను కుతూహల ముండకూడదు.

ఉపానహౌచ వాసశ్చ ధృతమన్యైర్నధారయేత్।
ఉపవీతమలంకారం స్రజం కరకమేవచ. (4–66)

ఇతరులు ధరించి విడిచిన పాదరక్షలను వస్త్రమును యజ్ఞోపవీతమును అలంకారమును పుష్పమాలను కమండలమును ధరింపరాదు.

వినీతైస్తువ్రజేన్నిత్య మాశుగైర్లక్షణాన్వితైః।
వర్ణరూపోపసంపన్నైః ప్రతోదేనాతుదన్ భృశం. (6-68)

బండిమీద వెళ్లవలసినచో చెప్పినట్లు వినునట్టియు, వేగముగా నడచునట్టియు, శుభలక్షణములు గల్గినట్టియు, చక్కని రంగురూపము గల్గినట్టియు ఎద్దులనుపూన్చిన బండిమీద వెళ్లవలయును. ఎద్దులనుకొట్టి పీడించకూడదు.

బాలాతపః ప్రేతధూమో వర్జ్యం భిన్నం తథాసనం।
నచ్ఛింద్యాన్నఖలోమాని దన్తైర్నోత్పాటయేన్నఖాన్.

లేతఎండ, శవధూమము, విరిగిపోయిన ఆసనము— ఇవితగవు. ఎప్పుడుపట్టిన నప్పుడు తలవెంట్రుకలను, గోళ్లను త్రుంపివేయుచుండరాదు, దంతములతో గోళ్ళనుకొఱకరాదు.

లోష్టమర్దీతృణచ్ఛేదీ, నఖఖాదీచయోనరః।
సవినాశం వ్రజత్యాశు సూచకోఽశుచిరేవచ. (4-71)

ఊరక మట్టిని మర్దించువాడు, గడ్డిపరకలను త్రుంచువాడు, చేతిగోళ్ళను తినువాడు, ఎదుటవాని ఉన్నదోషములనుకాని లేనిదోషములనుకాని వెల్లడించుచుండువాడు శుభ్రతలేనివాడు—వీరు శీఘ్రముగా వినాశము పొందుదురు.

అద్వారేణచనాతీయాద్గ్రామంవా వేశ్మవాఽవృతం।
రాత్రౌచ వృక్షమూలానిదూరతః పరివర్జయేత్. (4-73)

ఎల్లప్పుడును అన్నమును పూజింపవలయును; నిందింప కూడదు. అన్నమునుచూచి సంతోషమును, ప్రసన్నతను పొందవలయును, అభినందింపవలయును. (ఈయన్నమునలన ప్రాణధారణ సాధ్యమగుచున్నదనుభావము నుంచుకొన వలయునని ఆదిపురాణము చెప్పుచున్నది. ఈ భావమే ప్రాణాహుతులరూపముగాశిష్టాచారములోవ్యక్తమగుచున్నది దేవతానివేదితము కాకుండ అన్నము భుజింపరాదని స్థలాంతరమున చెప్పఁబడినది) పూజింపబడినదియై అన్నము బలమును, సామర్థ్యమును ఇచ్చును. పూజింపబడనిదై యీరెంటిని నాశనము చేయును.

నోచ్ఛిష్టంకస్య చిద్దద్యాన్నాద్యాచ్చైవ తథాన్తరా
నచైవాత్యశనం కుర్యాన్నచోచ్ఛిష్టఃక్వచిద్వ్రజేత్.
అనారోగ్య మనాయుష్య మస్వర్గ్యంచాతిభోజనమ్।
అపుణ్యంలోకవిద్విష్టంతస్మాత్తత్పరివర్జయేత్.(2—57,58

ఎంగిలి ఎవరికిని పెట్టరాదు. పగటిభోజనమునకును రాత్రిభోజనమునకును నడుమ భుజింపకూడదు. ఎక్కువ భుజింపకూడదు. అతిభోజనము;ఆయురారోగ్యములకు భంగకరము. స్వర్గప్రతిబంధకము, పాపావహము, లోకగర్హితము. ఎంగిలితో నెక్కడకును వెళ్ళకూడదు. (ఎంగిలితోనుండి బ్రాహ్మణుని, గోవును, అగ్నిని తాకరాదు.మరియు సూర్య చంద్రనక్షత్రాదులను చూడరాదు—4·142)

యద్వేష్టితశిరాభుంక్తే యద్భుఙ్క్తేదక్షిణాముఖః
సోపానత్కశ్చ యద్భుఙ్క్తేతద్వైరక్షాంసి భుంజతే (3-238

తలకు గుడ్డకట్టుకొనికాని, కాలిజోడుతో కాని భుజింపరాదు. దక్షిణాభిముఖముగా భుజింపరాదు. (తూర్పుముఖముగా భుజించుట మంచిది) బ్రాహ్మణులన్నము తినుచుండగా పందికాని, కోడికాని, కుక్క కాని, బహిష్ఠస్త్రీకాని, నపుంసకుడుకాని చూడకూడదు. అన్నము పంది వాసన చూచుచో చెడిపోవును, కోడియొక్క రెక్కలగాలి తగులుచో చెడును, కుక్కచూపు పడుచో చెడును.

## అ భ క్ష్య ము లు

లశునంగుంజనం చైవపలాండుం కవకానిచ
అభక్ష్యాణిద్విజాతీనా మమేధ్య ప్రభవానిచ (5—5)

వెల్లుల్లి, నీరుల్లి, చిన్నఉల్లి, కుక్కగొడుగులు, అమేధ్యములో పెరిగినకూరలు వీనిని తినకూడదు; ముఖ్యముగా బ్రాహ్మణులు తినకూడదు.

లోహితాన్ వృక్షనిర్యాసాన్ వృశ్చనప్రభవాంస్తథా
సేలుంగవ్యంచ పేయూషం ప్రయత్నేన వివర్జయేత్.

చెట్లయొక్క ఎఱ్ఱని జిగురును, చెట్లకు నాటుపెట్టగా వచ్చిన ఏరంగు జిగురునైనను తినకూడదు. అడవిమెంతి అవుజున్ను కూడ అభక్ష్యములు.

సముత్పత్తించ మాంసస్య వధబంధౌ చదేహినాం
ప్రసమీక్ష్య నివర్తేత సర్వమాంసస్య భక్షణాత్ [5-49]

ప్రాణిహింసవలననేకాని మాంసమురాదని తెలిసికొని ప్రాణులకు వధబంధములను గల్గించుట యెంత పాపమో గ్రహించి మానవుడు సర్వమాంసములను పరిత్యజింపవలెను.

అనిర్దశాయాగోః క్షీరమౌష్ట్రమైక శఫంతథా
ఆవికం సంధినీక్షీరం వివత్సాయాశ్చగోః పయః [5-8]

ఈనిన పదిదినములలోపున గోవుయొక్కయు, ఒంటెయొక్కయు, గొఱ్ఱెయొక్కయు పాలను త్రాగరాదు. ఎదపోయిన పశువుయొక్కయు, దూడచనిపోయిన గోవుయొక్కయు పాలనుకూడ త్రాగరాదు.

ఆరణ్యానాంచసర్వేషాం మృగాణాంమాహిషంవినా
స్త్రీక్షీరంచైవ వర్జ్యాని సర్వశుక్తాని చైవహి. [5-9]

పులుపెక్కినంతకాలము ఆగి ఆరణ్యకపశువు పాలను త్రాగరాదు. మానుషీక్షీరమునకుకూడ ఈనిషేధము వర్తించును. గేదెపాలకు వర్తించదు.

సంవత్సరస్యైకమపి చరేత్కృచ్ఛ్రంద్విజోత్తమః
అజ్ఞాతభుక్తశుద్ధ్యర్థం జ్ఞాతస్యతు విశేషతః. [5-21]

తెలియకుండగనే తినకూడని వస్తువులను తినుట సంభవింపవచ్చును. కావున బ్రాహ్మణుడు సంవత్సరమున కొకసారి కృచ్ఛ్రప్రాజాపత్య వ్రతమును చేసికొనవలయును. తెలియబడిన అన్నదోషమునకు శాస్త్రోక్త ప్రాయశ్చిత్తములను చేసికొనవలయును.

అభోజ్యమన్నం నాత్తవ్యమాత్మనః శుద్ధిమిచ్ఛతా
అజ్ఞానభుక్తంతూత్తార్యంశోధ్యంవాప్యాశుశోధనైః. [11-160]

పరిశుద్ధిని కోరువాడు అభోజ్యాన్నమును తినరాదు. ఒకవేళ తెలియకతిన్నచో వమనముచేసికొనవలయును. అది సాధ్యముకానిచో వెంటనే ప్రాయశ్చిత్తము చేసికొనవలయును. (చండాల దృష్టాన్నమును, అవరవర్ణ స్పృష్టాన్నమునుకూడ అభోజ్యములని మనువు చెప్పినాడు. (3-239)

## ప ం క్తి బా హ్యా త

అపాంక్తదానేయో దాతుర్భవత్యూర్ధ్వ ఫలోదయః
దైవేహవిషిప్రత్యే వాతత్ప్రవక్ష్యామ్యశేషతః(3—169)

సత్పురుషులతో కలసి పంక్తిలో భోజనముచేయుటకు అర్హతలేనివారు కొందరు కలరు. వారు సాధారణసమయములలోనే సహపంక్తి భోజనమునకు అనర్హులు. అట్టివారికి దైవపిత్ర్య కర్మలలో భోజనము పెట్టుట మరింతనిషిద్ధము. (3—70) అన్నకువివాహముకాకుండ తానువివాహముచేసికొన్నవాడు, మద్యపానాదులుచేసినవాడు, కుష్ఠరోగి, అతి కోపస్వభావము కలవాడు, శత్రువు, వేటగాడు మున్నగువారుఅపాంక్తేయులు

## ప ం క్తి పా వ ను లు

అగ్ర్యాస్సర్వేషు వేదేషు సర్వప్రవచనేషు చ
శ్రోత్రియాన్వయజాశ్చైవ విజ్ఞేయాఃపంక్తిపావనాః. (3_184)

బ్రాహ్మణుల భోజనపంక్తిలో అపాంక్తేయులు తెలియబడకుండగానే యుందురేమోయను శంకతో పంక్తిపావనులను కూర్చుండబెట్టుటమంచిది. పంక్తిని పవిత్రముచేయగలవారెవరనగా: చతుర్వేదములలోను, తదర్థప్రవచనములలోను

శ్రేష్ఠులు, శ్రోత్రియవంశములో పుట్టినవారు, త్రిణాచికేత మను వేదభాగమును చక్కగా అధ్యయనము చేసినవారు, అగ్నిహోత్రి, త్రిసుపర్ణపాఠకుడు, షడంగవేత్త, బ్రాహ్మవివాహమువలన జన్మించినవాడు, నూరేండ్లవయస్సుగలవాడు, సహస్రగోదానము చేసినవాడు. ఇటచెప్పబడిన లక్షణములు వేదాధ్యయన సంపత్తితోకూడికొన్నప్పుడు మాత్రమే పంక్తి పావనత్వమును కల్గించును.

## స్పృశింపరాని అవయవములు

ఊర్ధ్వంనాభేర్యాని ఖానితాని మేధ్యానిసర్వశః
యాన్యధస్తాన్యమేధ్యాని దేహాచ్చైవమలాశ్చ్యుతాః [5-32
అనాతురః స్వానిఖాని నస్పృవేదనిమిత్తతః
రోమాణిచరహాస్యాని సర్వాణ్యేవ వివర్జయేత్ (4-144)

నాభికిపైనున్న అవయవములన్నియు పవిత్రములు. కావున వానిని స్పృశించినను అపరిశుద్ధి కలుగదు. నాభికి క్రిందిభాగములు అపరిశుద్ధములు. వానిని స్పృశించునో అపరిశుద్ధి కలుగును. దేహమునుండివచ్చు మలములన్నియు అపరిశుద్ధములు.

ఆరోగ్యముగానున్నవాడు కేశములను, నేత్రశ్రోత్రాదీంద్రియములను అకారణముగా స్పృశింపరాదు.

## సంధ్యానిద్ర కూడదు

సూర్యేణహ్యాభినిర్ముక్తః శయానోభ్యుదితశ్చయః
ప్రాయశ్చిత్తమకుర్వాణోయుక్తః స్యాన్మహతైనసా. 2-221

సూర్యోదయ సూర్యాస్తమయములయందు నిద్రపోవు వాడు మహాపాపము పొందును. అట్టివాడు ప్రాయశ్చిత్తము చేసికొనవలయును

## శుద్ధికరములు.

సర్వేషామేవ శౌచనా మర్థశౌచంపరంస్మృతం
యోఽర్థేశుచిర్హి సశుచిర్నమృద్వారిశుచిశ్శుచిః (5-106

అన్నివిధములైన శౌచముకంటె అర్థశౌచము గొప్పది. (అనగా అన్యాయమార్గముచేత ధనము సంపాదింపకుండుట సర్వోత్తమమైన శౌచమును కల్గించును.) ధనవిషయములో శుచియైనవాడే నిజముగా శుచియైనవాడు. మన్ను, నీరు మున్నగువానితో తోముకొనుటవలన కల్గిన పరిశుద్ధి యంత గొప్పదికాదు.

అద్భిర్గాత్రాణిశుద్ధ్యన్తిమనః సత్యేనశుద్ధ్యతి
విద్యాతపోభ్యాంభూతాత్మాబుద్ధి ర్జ్ఞానేనశుద్ధ్యతి. 5-109

మాలిన్యముపొందిన శరీరము నీటిచే పరిశుద్ధమగును. మురికిసంపర్కము గల నది వేగముగా ప్రవహించుట వలన శుద్ధమగును. మనస్సు సత్యముచేత శుద్ధమగును. జీవాత్మ బ్రహ్మవిద్యచేతను, తపస్సుచేతను శుద్ధినిపొందును. బుద్ధి జ్ఞానముచేత శుద్ధమగును.

జ్ఞానంతపోఽగ్ని రాహారోమృన్మనో వార్యుపాంజనం
వాయుఃకర్మార్క కాలౌచశుద్ధేఃకర్తాణిదేహినాం.5-110

బ్రహ్మజ్ఞానము అంతఃకరణమునకు శుద్ధిని గల్గించును. తపస్సు వేదవిదులు మున్నగువారికి శుద్ధినికల్గించును అగ్ని మైలపడినకుండలు మున్నగువానికి శుద్ధినికలిగించును. దేవతలకు అర్పింపగా మిగిలిన హవిస్సు భక్షించువారికి శుద్ధిని కలిగించును. మంచిమనస్సు వాక్కునకు పవిత్రకల్గించును. నీరు బహువస్తువులకు శుద్ధినిగల్గించును. అలుకుట నేలకు శుద్ధిని గల్గించును. అపవిత్రులైపోయినవారికి కొన్ని కర్మానుష్ఠానములు శుద్ధినిగల్గించును. కాలము గడచుటకూడ కొన్నిటికి శుద్ధినిగల్గించును. కాలము, కొన్నివిధములైన వాయువులు వీచుట కూడ శుద్ధిని గల్గించును. కొన్ని సందర్భములలో సూర్యసందర్శనము శుద్ధిని కల్గించును.

క్షాంత్యాశుద్ధ్యంతి విద్వాంసో దానేనా కార్యకారిణః ।
ప్రచ్ఛన్న పాపాజప్యేన తపసా వేదవి_త్తమాః (5–107)

విద్వాంసులు ఓర్పుచేత పరిశుద్ధులగుదురు. కూడని పనులుచేయువారు దానమువలన కొంతవరకు శుద్ధిని పొందుదురు. అశ్లీరహాస్యపాపములను చేసినవారు మంత్రజపములవలవ శుద్ధినిపొందుదురు.

నిర్లేపం కాంచనం భాండమద్భిరేవ విశుద్ధ్యతి
అబ్జమశ్మమయంచైవ రాజతం చానుపస్కృతం (5–112)

ఉచ్ఛిష్ట మంటుకొనకున్నచో బంగారము, శంఖము, రాళ్లు, వెండి వీనికి సంబంధించిన వస్తువులు నీటితో కడుగుటవలననే శుద్ధిపొందును. (ఉచ్ఛిష్టమంటుకొన్నను, మసి

పట్టినను, వెండి బంగారములు నీటితోను నిప్పుతోను శుద్ధి పొందును.)

ద్రవ్యాణాం చైవసర్వేషాం శుద్ధిరుత్పవనం స్మృతం
ప్రోక్షణం సంహతానాంచదారవాణాంచతక్షణం.5-115

కాకి, కోడి మున్నగువానిచే స్పృశింపబడిన ఘృతాదితైలములకు కుశలతో ఉత్పవనము చేయుటవలన శుద్ధికలుగును, శయ్యమున్నగువానికి శుద్ధికలుగవలెనన్నచో నీటిని చల్లవలయును. కఱ్ఱతో చేయబడినవానికి ఎక్కువ మాలిన్యమంటుచో పైభాగమును చెక్కివేయుటవలన శుద్ధికలుగును. (వస్త్రములను నీటితో తడుపుటవలన శుద్ధికలుగునని స్థలాంతరమున చెప్పబడినది.)

విణ్మూత్రోత్సర్గ శుద్ధ్యర్థం మృద్వార్యాదేయ మర్థవత్।
దైహికానాం మలానాంచశుదిషు ద్వాదశస్వపి (5-135)

మలమూత్రములను విడచినపిమ్మట ఆ యవయవములను మట్టితోను, నీటితోను శుద్ధిచేయవలయును. (దేహమునుండి బయటకువచ్చు చెమటమున్నగు మిగిలిన పది మలములలోను రక్తము మున్నగువానికి మృద్వారుల రెండింటితోను శ్లేష్మము మున్నగువానికి కేవలము నీటితోనుశుద్ధికలుగును.)

కృత్వామూత్రంపురీషం వాఖాన్యాచాంత ఉపస్పృశేత్
వేదమధ్యేష్య మాణశ్చ అన్నమశ్నంశ్చ సర్వదా(5-138

మలమూత్రముల ;యనంతరము పైనిచెప్పబడినట్లు శౌచమునుచేసికొని ఆచమనముచేసి నేత్రములను శ్రో

త్రిములను, నాశికారంధ్రములను స్పృశింపవలయును. వేదాధ్యయనముచేయుటకును, భోజనమునకును, పూర్వముకూడ ఇట్లే చేయవలెను.

నిద్రనుండి లేచినపిమ్మట, తుమ్మినపిమ్మట, భోజనమునకుపిమ్మట, నిష్ఠీవనమునకు పిమ్మట, నీరుత్రాగినపిమ్మట ఆచమనము చేయవలయును.

## స్నా న ము

నస్నాన మాచరేద్భుక్త్వా నాతురో నమహానిశి
న వాసోభిః సహాజస్రం నావిజ్ఞాతే జలాశయే (4-129

భోజనము చేసినపిమ్మట స్నానము చేయకూడదు. రోగియై స్నానమాచరించకూడదు; అర్ధరాత్రియందు స్నానముచేయకూడదు. హెచ్చుగా వస్త్రములు వేసికొని స్నానముచేయరాదు. పరిచితముకాని చెరువులో స్నానము చేయకూడదు.

నదీషు దేవఖాతేషు తడాకేషు సరస్సుచ
స్నానం సమాచరేన్నిత్యం గర్తప్రస్రవణేషుచ. (4-203)

నదులయందును, దేవతలచేనిర్మింపబడిన తటాకములందును, సరస్సులయందును, ఇతర జలాశయములయందును స్నానము చేయవలయును.

## ఒ ట్టు పె ట్టు కొ న రా దు

న వృథాశపథం కుర్యాత్ స్వల్పేఽప్యర్థేనరోబుధః
వృథాహిశపథంకుర్వన్ ప్రేత్యచేహచనశ్యతి॥ (8-111)

వ్యర్థముగా ఒట్టు పెట్టుకొనగూడదు; చిన్నవిషయము లకుగూడ ఒట్టు పెట్టుకొనగూడదు. అట్లుపెట్టుకొనుచో ఇహ పరలోకములలో హానిగల్గును.

## మాంగళ్యకరములు

మంగళాచార యుక్తానాం నిత్యంచప్రయతాత్మనాం
జపతాం జుహ్వాతాం చైవవినిపాతోన విద్యతే. (4-146)

అభీష్ట కార్యసిద్ధికొఱకు గోరోచనాదిధారణముగావిం చుట, గురుసేవాది సదాచారములను గల్గియుండుట, ఇంద్రియనిగ్రహమును బాహ్యాభ్యంతర శౌచమును గల్గియుండుట గాయత్ర్యాదిజపము గావించుట, శాస్త్రీయమైన హోమము నాచరించుట—ఈధర్మములందుండువారికి ఎన్నటికి పతనము కలుగదు.

జీవితములో ఆశాభంగములుకలిగినను, దారిద్ర్యాదు లనుభవింపవలసి వచ్చినను "ఇక నాబ్రతుకు ఇంతియే"యని మానవుడు నిరుత్సాహపడి తన్నుతా నవమానించుకొన రాదు. యావజ్జీవము శుభమునుకోరుచు అది తనకు దుర్లభముకాదనుభావముతో నుండవలయును.

నాత్మానమవమన్యేత పూర్వాభిరసమృద్ధిభిః
ఆమృత్యోఃశ్రియమన్విచ్ఛేన్నైనాంమన్యేతదుర్లభం (4-137

## పూర్వాహ్ణకర్తవ్యములు

మైత్రం ప్రసాధనం స్నానం దంతధావనమంజనం
పూర్వాహ్ణఏవకుర్వీత దేవతానాంచపూజనం (4-152)

స్నానము, మలోత్సర్జనము, అలంకారము, దంతధావనము, కాటుక పెట్టుకొనుట దేవతాపూజనము- వీటిని ప్రొద్దుటిపూటనే చేయవలయును. (మధ్యాహ్నమునకు పూర్వముననే చేయవలయును.)

ఇట్టి సదాచారములెన్నియో మనుస్మృతిలోను, ఇతర స్మృతులలోను కన్పట్టుచున్నవి; వీనిని పాటించుటచే శుభప్రాప్తి, అశుభనివారణము కలుగును. ఆచారములకుకాని అనాచారములకుకాని చెప్పబడిన శుభాశుభఫలములు సమగ్రములని తలంపరాదు. చెప్పబడని ఫలములుకూడనుండును. కొన్నిపట్ల శుభాశుభఫలములు నిర్దేశింపబడవుకూడను. సదాచారములకు రజస్తమోగుణములను తగ్గించి సత్త్వగుణమును వృద్ధినొందించు స్వభావముకలదు. అట్లే దురాచారములకు సత్త్వగుణమును తగ్గించి రజస్తమోగుణములను పెంచుస్వభావము కలదు. ఎంత అప్రధానములుగా పైకి కన్పట్టువానికైనను ఈలక్షణము కలదు. వెనువెంటనేకాని, చిరకాలమునకుకాని సుఖదుఃఖరూపఫలము వీనికి గలుగును. దృశ్యఫలమే ఫలమనితలంపరాదు. మరియు దృశ్యఫలములుకూడ అన్నియు మనకు దృష్టము లగుటలేదు. గ్రహణ సమయములలో సూర్యుని చూడరాదని మనువు నిషేధించినాడు. (4-37) గ్రహణసమయములలో సూర్యుని చూచుటవలన అంధత్వము రావచ్చునని ఆధునికవిజ్ఞాన నిష్ణాతులు చెప్పుచున్నారు. వీరీసంగతిని కనిపెట్టకపూర్వము మనువచనము అప్రమాణ

మును, కనిపెట్టిన తర్వాత ప్రమాణమునుకాదు. మనముఫల
మును కనిపెట్టగల్గుటతోను, కనిపెట్టజాలక పోవుటతోను
నిమిత్తములేకుండ స్మృతివచన మెప్పుడును శ్రేయస్సాధ
కమే యగును.

రాత్రిలందు చెట్లక్రిందనుండరాదనియు, దూరముగా
నుండవలయుననియు మనుస్మృతి చెప్పుచున్నది. (4-73) ఈ
విషయములో ఆధునికవిజ్ఞానమిట్లు చెప్పుచున్నది పగటి
పూట చెట్లు బొగ్గుపులుసుగాలినిపీల్చి ప్రాణవాయువును విడ
చును. కావున చెట్టువద్దనుండు మానవునినుండి బయటకు
వచ్చు బొగ్గుపులుసుగాలి హరించిపోవుటయేకాక వానికి
పుష్కలముగా ప్రాణవాయువు లభించును. రాత్రిలందు
వృక్షములు ప్రాణవాయునే పీల్చుకొనును, బొగ్గుపులుసు
గాలిని బయటకు విడచును. కావున చెట్టువద్దనుండుట పగటి
పూట లాభకరము; రాత్రిపూట హానికరము. ఇట్లుమనువచ
నమును సైన్సుసమర్థించుచున్నను, ఈసమర్థనము మీదనే
మనువచన ప్రామాణ్యమాధారపడియున్నదని తలంపరాదు.
సైన్సు ఈసంగతిని కనిపెట్టుటకు పూర్వమునను మనువచ
నము శిరోధార్యమే; నేడును శిరోధార్యమే. అట్లే మనువు
చెప్పిన సమస్తధర్మములు మనము వాని ఔచిత్యానౌచిత్య
ములను తెలిసికొనగల్గినను తెలిసికొనజాలకపోయినను ప్రమా
ణములే యగును

---

## ౮. ఆధ్యాత్మికసాధనలు.

మనువు ప్రదర్శించిన కల్యాణ మార్గము ఐహికాము ష్మిక సుఖప్రాపకము మాత్రమే కాక ఆత్మ వికాస హేతువు కూడనని గుర్తింపదగును. అంతఃకరణమును నిర్మలము గావించుకొనుటకును, మోక్షార్హతను చేకూర్చుకొనుటకును మానవు డవలంబింపవలసిన సాధనముల ననేకములను మనువు నిర్దేశించినాడు. మచ్చునకు కొన్నింటిని సమీక్షింతము.

### ఇంద్రియనిగ్రహము.

ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛ త్యసంశయమ్
సన్నియమ్యతు తాన్యేవ తతఃసిద్ధిం నియచ్ఛతి. (2-93)

త్వగింద్రియమును స్పర్శమీదకును నేత్రేంద్రియమును రూపముమీదకును, జిహ్వేంద్రియమును రుచిమీదకును, ఘ్రాణేంద్రియమును వాసనమీదకును, శ్రోత్రేంద్రియమును శబ్దముమీదకును ఆసక్తితో ప్రసరింపజేయుట వలనను, మనస్సును చపలముగ నుంచుకొనుటవలనను మానవుడు తప్పక దోషమును పొందును. వానిని నిగ్రహించుకొనుచో ఉత్తమ పురుషార్థసిద్ధిని – మోక్షమును–గూడ పొందగల్గును.

నజాతుకామః కామానా ముపభోగేన శామ్యతి
హవిషాకృష్ణవర్త్మేవ భూయఏవాభివర్ధతే. (2-94)

భోగముల ననుభవించుటవలన కోరిక చల్లారదు; పైగా వృద్ధిపొందుచునేయుండును. అగ్నిహోత్రములో హవి

స్సును వేయుటవలన అగ్ని ఆరిపోవుటకు బదులుగా వృద్ధియే చెందును గదా!

యశ్చైతాన్ ప్రాప్నుయాత్సర్వాన్ యశ్చైతాన్కేవలాం
స్త్యజేత్
ప్రాపణాత్సర్వకామానాం పరిత్యాగోవిశిష్యతే. (2–95)

ఒకడు కోరినభోగముల నన్నిటిని పొందవచ్చును; మరొకడు అన్నిభోగములపట్లను ఉపేక్షాభావముతో నుండవచ్చును. ఆ పొందినవానికంటె ఈ యుపేక్షాభావము గలవాడు గొప్పవాడు, భోగములను పొందుటకంటె వాని నుపేక్షించుట యెక్కువది. ఏలయన భోగములను పొందినవాడు వానిని అనుభవించు సాధనములను సంపాదించుకొనుటలో క్లేశపడవలసి యుండును, మరియు ఆభోగములు ముగిసిపోవునపుడు దుఃఖమును పొందును. భోగముల నుపేక్షించువానికి ఈ బాధ లేదు. వాడెల్లపుడును ప్రశాంతముగానే యుండును.

నతథైతాని శక్యన్తే సన్నియన్తుమసేవయా
విషయేషు ప్రజుష్టాని యథాజ్ఞానేననిత్యశః. (2–96)

విషయానుభవములలో నున్న ఇంద్రియములను నిగ్రహించుటకు రెండుసాధనములు కలవు

(1) ఇంద్రియములను విషయములచెంతకు పోనీయకుండుట, (2) విషయభోగములు క్షణికములనియు, శరీరము అస్థి రక్తమజ్జాది మయమనియు నిరంతరము భావించుచుండుట. ఈ రెండవదానివలన నిగ్రహింపబడినంతగ నింద్రియములు మొదటిదానివలన నిగ్రహింపబడవు ఏలయన. విషయ

ములు దగ్గరలేక పోయినను మనస్సు వానికై పరితపించుట సంభవించును. జ్ఞానమువలన విషయముల పట్ల మనస్సులో కూడ ఉపేక్షాభావమేర్పడును.

వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చతపాంసిచ
నవిప్రదుష్టభావస్య సిద్ధింగచ్ఛంతి కర్హిచిత్. (2-97)

వేదములు, త్యాగము, యజ్ఞములు, నియమములు, తపస్సులు—ఇవి భోగాభిలాషచే దూషితమైన మనస్సుగల వానికి ఫలింపవు.

శ్రుత్వాస్పృష్ట్వాచదృష్ట్వాచ భుక్త్వాఘ్రాత్వాచ యోనరః
నహృష్యతిగ్లాయతివా సవిజ్ఞేయో జితేంద్రియః. (2-98)

శబ్దములను వినుచును, వస్తువులను స్పృశించుచును, రూపములను చూచుచును, రుచుల నాస్వాదించుచును, వాసనల నాఘ్రాణించుచునుగూడ ఏమానవుడు సంతోషింపడో, బాధపడడో వాడు జితేంద్రియుడుగా తెలియదగినవాడు.

ఇంద్రియాణాంతు సర్వేషాం యద్యేకంక్షరతీంద్రియం
తేనాస్యక్షరతిప్రజ్ఞా దృతేఃపాదాదివోదకమ్. (2-99)

త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణ శ్రోత్రేంద్రియములలో నే యొక్క యింద్రియము విషయము మీదికి ప్రసరించినను మానవుని ప్రజ్ఞ జారిపోవును. నీళ్ళుగల తిత్తికి చిల్లులు పడుచో ఆచిల్లులున్నచోటున గలసినేకాక తిత్తిలోని నీరంతయు కారిపోవును అట్లేఒక యింద్రియమునుండి ప్రజ్ఞజారుచో మానవుడు తత్త్వజ్ఞాన రహితుడగును.

వశేకృత్వేంద్రియగ్రామం సంయమ్యచమనస్తథా
సర్వాన్ సంపాదయేదర్థా నక్షిణ్వన్ యోగతస్తనుం.(2-100

ఇంద్రియములను స్వాధీనము చేసికొని మనస్సును కూడ నిగ్రహించుకొనువాడును ఉపాయముచేత శరీరమును పీడించుకొననివాడును సర్వపురుషార్థములను సాధించుకొన వచ్చును.

కావున మానవుడు మనస్సును, వాక్కును, శరీరమును విచ్చలవిడిగా పోనీయరాదు. వానిని అణచిపెట్టి ధర్మమార్గములో నడుపుకొనవలయును. ఎవడిట్లుమనోదండమును, వాగ్దండమును, కాయదండమును గలిగి వానిని శిక్షించుకొనునో వాడు త్రిదండియని చెప్పబడును. అతడు కామక్రోధములను జయించి మోక్షార్హతను పొందును.

వాగ్దండోஉథమనోదండః కాయదండస్తథైవచ
యస్యైతేనిహితాబుద్ధౌ త్రిదండీతిసఉచ్యతే. (11-10)

వేదాభ్యాసస్తపోజ్ఞాన మింద్రియాణాంచ సంయమః
అహింసాగురుసేవాచ నిఃశ్రేయసకరంపరం. (12-83)

వేదాభ్యాసము, తపస్సు, జ్ఞానము, ఇంద్రియనిగ్రహము, అహింస, గురుసేవ—ఇవి మోక్షము నొసగును.

సర్వేషామపిచైతేషా మాత్మజ్ఞానంపరంస్మృతం
తద్ధ్యగ్రం సర్వవిద్యానాం ప్రాప్యతేహ్యమృతం తతః.(6-89)

ఈ యన్నింటిలోను ఆత్మజ్ఞానము గొప్పది, దానివలన అమృతత్వము లభించును, అది సర్వవిద్యలలోను శ్రేష్ఠము.

## నిత్యనైమిత్తిక కర్మలు.

బ్రాహ్మముహూర్తమందు నిద్రనుండి లేవగానే ధర్మార్థములనుగురించి యాలోచింపవలయును. (అనగా ధర్మమునకు విరుద్ధము కాని విధమున అర్థార్జనమును గావించుట యెట్లో ధనముచే ధర్మము నెట్లాచరింపవలయునో ఆలోచింపవలయును.) మరియు ఏపనిచేయుటవలన నెంత అర్థము లభించునో యెంత ధర్మము సంపాదించినట్లగునో బాగుగా నాలోచించుకొని ధర్మార్థములకు సహాయపడని శరీర క్లేశకరము లయిన పనులను విడుచుటకును ధర్మార్థముల యభివృద్ధికి సాయపడు పనులను గావించుకొనుటకును నిశ్చయించుకొనవలయును, మరియు నాసమయమున వేద తత్త్వార్థము నాలోచింపవలయును. (వేదము కర్మ బ్రహ్మోభయాత్మకము కావున పరమాత్మ తత్త్వమును గురించియు, ధర్మతత్త్వమును గురించియు, నాలోచింపవలయును.)

బ్రాహ్మేముహూర్తే బుద్ధ్యేత ధర్మార్థౌచానుచిన్తయేత్
కాయక్లేశాంశ్చ తన్మూలాన్ వేదతత్త్వార్థమేవచ.(4-92

ఇట్లు ఆత్మతత్త్వమునుగుఱించియు, ధర్మమునుగుఱించియు కొంత చింతించినపిమ్మటనే నిత్యకర్మానుష్ఠానము లోనికిని, పిమ్మట సమస్తవ్యవహారములలోనికిని దిగవలయు ననుటచే ఆత్మసాధన లక్ష్యమనపాయిగా హృదయములో నుండవలయునని స్పష్టమగుచున్నది.

జ్ఞానవైరాగ్యములకు ప్రతిబంధకమైన అంతఃకరణ మాలిన్యమును క్షాళనము చేయుశక్తి నిత్యకర్మానుష్ఠానము నకు గలదు. స్నానము, సంధ్య, జపము, హోమము, బ్రహ్మ యజ్ఞము, దేవపూజ, ఆతిథ్యము, వైశ్వదేవము అనునవి నిత్యకర్మలు.

తలిదండ్రులనుండి జన్మతోనే సంక్రమించు బీజసం బంధమైనట్టియు, గర్భసంబంధమైనట్టియు పాపము గర్భా ధాన, పుంసవన, సీమంతోన్నయన, జాతకర్మ, నామకర ణాన్న ప్రాశనోపనయన వేదవ్రత, గోదాన, స్నాతక వివాహముల నెడు సంస్కారములచేత పోగొట్టుకొనదగినది

గార్భైర్హోమైర్జాతకర్మ చౌడమౌంజీనిబంధనైః
బైజికంగార్భికంచైనో ద్విజానామపమృజ్యతే (2-27)

వేదాధ్యయనముచేతను, వ్రతములచేతను, హోమ ములచేతను, త్రైవిద్యాఖ్యవ్రతముచేతను, బ్రహ్మచర్య ములో దేవర్షి పితృతర్పణాత్మకమైన యజ్ఞముచేతను, గృహ స్థాశ్రమములో పుత్రోత్పాదనము చేతను, పంచమహాయజ్ఞ ములచేతను, జ్యోతిష్టోమాది క్రతువులచేతను ఈశరీరము (అందలియాత్మ) బ్రహ్మప్రాప్తికి అర్హతకలది యగుచున్నది.

ఏకాదశ్యాదితిథులలోను, గ్రహణాది సమయముల లోను ఆచరింపదగిన కర్మలును, పితృకర్మలును నైమిత్తిక ములే యైనను అవశ్యాచరణీయములుగా చెప్పబడినవి. దైవ కార్య పితృకార్యములకు సంఘర్షణము వచ్చినపుడు ద్విజులు

పితృకార్యమునకే అగ్రస్థానము నీయవలయునని మనువు చెప్పుచున్నాడు.

దేవకార్యాద్ద్విజాతీనాంపితృకార్యం విశిష్యతే. (3-203)

శ్రేయస్కాములైనవారు నిత్యనైమిత్తిక కర్మలను శ్రద్ధతో నాచరించుచో ప్రత్యవాయ నివారణమేకాక పాప క్షయముకూడ గల్గును.

ఈగ్రంథములో ఆచారప్రకరణములో తెలుపబడిన ఆహారశుద్ధి మున్నగునంశములుకూడ అంతఃకరణశుద్ధిని కల్గించుటద్వారా ఆధ్యాత్మిక వికాసమునకు తోడ్పడగలవు. అట్లే సమాజ వ్యవస్థాప్రకరణములో తెలుపబడిన గురు సేవాది ధర్మములు చిత్తమునకు త్తేజనము గల్గించును.

తమతమ వర్ణములకును, ఆశ్రమములకును విహితము లైన కర్మలను నిష్కామముగా ఆచరించువారు పరమపద మును పొందుట కర్హులగుదురు. (వర్ణాశ్రమ ధర్మములను గూర్చి కొంత విపులవిచారమును నా "హిందూమతము"లో గావించినాను, కావున నిట నాప్రసంగమును విడచినాను.)

## సత్యము

అసత్యము ఆత్మద్రోహము. సత్య ప్రాముఖ్యమును తెల్పు నీక్రింది శ్లోకములో ఆత్మన్ శబ్దప్రయోగను గమ నింపదగినది.

యోఽన్యథా సంత మాత్మాన మన్యథా సత్సుభాషతే
సపాపకృత్తమోలోకే స్తేన ఆత్మాపహారకః. (4-255)

అసత్యమాడువాడు తన మనస్సేరీతిగా నున్నదో యారీతిగా కాక మరొకరీతిగా తనయాత్మను పైకి రానిచ్చుచున్నాడు. అసత్యముచే నితరులను మోసగించితినని వాడు తలచుచున్నాడు. కాని యథార్థముగా తనయాత్మను తానే అపహరించుచున్నాడు. కనుక వాడు పాపులలో నెల్లపాపాత్ముడు.

వాచ్యర్థా నిహితాస్సర్వే వాజ్మూలా వాగ్వినిస్సృతాః
తాంతుయస్తేనయేద్వాచం సస్వర్వస్తేయకృన్నరః (4–256

అన్ని వస్తువులును శబ్దములయందే యున్నవి; శబ్దములే మూలముగా కలవి; శబ్దములనుండియే వెల్లడి యగుచున్నవి. అట్టివాక్కు నెవడు అపహరించునో (అసత్యముగా పల్కునో) వాడు అన్నివిధములైన దొంగతనమును చేసినవాడగును.

## ధన శుద్ధి

అన్నశుద్ధి కేవలము బాహ్యశౌచము మీదనే యాధారపడి యుండదు. అన్నమే కాదు; మనమనుభవించు సమస్త వస్తువులును దోషరహితములుగా నుండవలయు నన్నచో నవి న్యాయమార్గములో సంపాదింపబడి యుండవలయును. అన్యాయముగా సంపాదింపబడిన ధనముతో అనుభవింపబడు అన్నాదులు అంతఃకరణమునకు మాలిన్యమును గల్గించును. పాపము పోవుటకై యెవరైనను దానము చేయుగా వచ్చినధనమునకు కూడ నీపాపము అంటుకొని యుండును. అట్టి అన్యాయ్య ధనమును దగ్గరికి రానియరాదు.

ఒకవేళ తెలియక రానిచ్చుచో తెలియగానే విడిచిపెట్టవలయును. కొంత అనుభవింపబడిన తర్వాత తెలిసినచో జపముచేతను, తపస్సుచేతను అంతఃకరణ శుద్ధిని గావించుకొనవలయును.

యద్గర్హితేనార్జయంతి కర్మణా బ్రాహ్మణాధనం
తస్యోత్సర్గేణ శుద్ధ్యన్తి జప్యేనతపసైవచ. (1-193)

దానముచేయబడినను పాపాత్ముని ధనమును గ్రహింపరాదు. దాతయొక్క పాపములు దత్తద్రవ్యముద్వారా ప్రతిగ్రహీతకు సంక్రమించును. రాజైనను సరియే లుబ్ధుడును, పాపియునైనచో ఆతని ధనమును గ్రహింపరాదు.

యోరాజ్ఞః ప్రతిగృహ్ణాతి లుబ్ధస్యోచ్ఛాస్త్రవర్తినః
సపర్యాయేణ యాతీమాన్ నరకానేక వింశతిం. (4-87)

సాధారణముగాకూడ ప్రతిగ్రహము పాపజనకము, విద్యాతపస్సులచేతనే యాపాపముపోగలదు. విద్యాతపస్సులులేనివాడు ప్రతిగ్రహముచేయుచో ఱాతిపడవ నెక్కినవానివలె మునిగిపోవును.

అతపాస్త్వనధీయానః ప్రతిగ్రహరుచిర్ద్విజః
అంభస్యశ్మప్లవేనేవ తేనైవసహమజ్జతి. (4-190)

బ్రాహ్మణునకు ప్రతిగ్రహాధికారమున్నను విద్యాతపస్సులులేనిచో ప్రతిగ్రహము పాపజనకమగును. విద్యాతపస్సులున్నవాడుకూడ ప్రతిగ్రహమునవలన తేజస్సును కోల్పోవును.

ప్రతిగ్రహసమర్థోపి ప్రసంగం తత్రవర్జయేత్
ప్రతిగ్రహేణహ్యస్యాశు బ్రాహ్మం తేజః ప్రణశ్యతి. (4-186

కావున సమర్థుడైనవాడుకూడ ప్రతిగ్రహము చేయకుండుటమేలు.

## హృదయ మార్దవము

మెత్తనిస్వభావమును ఇంద్రియనిగ్రహమును దాతృత్వమునుగల్గి, దృఢవ్రతుడయి క్రూరులతో స్నేహముచేయక ఎవరికిని హింసగావింపకయుండు మానవుడు స్వర్గమును జయించును.

దృఢకారీ మృదుర్దాంతః క్రూరాచారై రసంవసన్
అహింస్రోదమ దానాభ్యాంజయేత్స్వర్గంతథావ్రతః. 4-246

పరలోకము లేదను బుద్ధిని, వేదనిందను, దేవతా దూషణమును, ద్వేషమును, దంభమును, దురభిమానమును, కోపమును, క్రూరత్వమును విడిచిపెట్టవలయును.

నాస్తిక్యం వేదనిందాంచ దేవతానాంచ కుత్సనం
ద్వేషందంభంచమానంచక్రోధంతైక్ష్ణ్యంచవర్జయేత్. 4-163

## వేదాభ్యాసము

వేద మే వాభ్యసే న్నిత్యం యథాకాలమతంద్రితః
తంహ్యస్యాహుః పరంధర్మముపధర్మో౽న్యఉచ్యతే. 4-147

బ్రాహ్మణుడు నిత్యము వేదాభ్యాసము చేయుచుండవలయును. ముఖ్యముగా అవసరములకు తగినట్లు శ్రేయోహేతుకములయిన మంత్రములను జపించుచుండవలయును. ఇదియే

బ్రాహ్మణునకు సర్వోత్కృష్టమైన ధర్మము. మిగిలిన ధర్మ మంతయు దీనికి లోబడినదే.

వేదాభ్యాసేన సతతం శౌచేన తపసైవచ
అద్రోహేణచ భూతానాంజాతింస్మరతి పౌర్వికీం. (4–148

బ్రాహ్మణుడు వేదాభ్యాసము చేయుటచేతను, శుచిగా నుండుటచేతను, తపస్సు చేయుటచేతను, ఏ ప్రాణికిని ద్రోహము చేయకుండుటచేతను పూర్వజన్మ జ్ఞానమును పొందగల్గును.

పౌర్వికీం సంస్మరన్ జాతిం బ్రహ్మైవాభ్యసతే పునః
బ్రహ్మాభ్యాసేనచాజస్ర మనంతం సుఖమశ్నుతే. (4–149

పూర్వజన్మను స్మరించుటవలన సంసారమందు రోత పుట్టి మోక్షమునుకోరి తిరిగి వేదాధ్యయనమునే చేయును. నిరంతరము వేదాభ్యాసము చేయుటవలన మోక్షానందమును పొందును.

ఇట్లు వేదాభ్యాసమొక గొప్ప యాధ్యాత్మికసాధనముగా పేర్కొనబడినది.

యథైధస్తేజసా వహ్నిః ప్రాప్తం నిర్దహతిక్షణాత్।
తథాజ్ఞానాగ్నినాపాపం సర్వందహతి వేదవిత్. 11–247

అగ్ని యేరీతిగా కట్టెపుల్లలను తగులబెట్టునో యట్లే వేదవిదుడు పాపమును జ్ఞానాగ్నిచేత తగులబెట్టును.

## ప్రాయశ్చిత్తములు

పాపముచేసినవాడు తనపాపము నితరులకు చెప్పుకొనుట చేతను, పశ్చాత్తాప పడుటచేతను, ఉగ్రతపస్సుచేతను,

లేదా గాయత్ర్యాదిమహామంత్రజపముచేతను, దానము చేతను, పరిశుద్ధి నొందును.

యథాయథానరోధర్మం స్వయంకృత్వానుభాషతే
తథాతథాత్వచేవాహిస్తేనా ధర్మేణముచ్యతే. (11-228)

నరుడు తాను చేసిన అధర్మము నెంతగా చెప్పు కొనునో అంతగా వాడు పాము కుబుసముచేత విడువబడునట్లు ఆ యధర్మముచేత విడువబడును.

కృత్వాపాపంహిసంతప్య తస్మాత్పాపాత్ప్రముచ్యతే
నైవం కుర్యాంపునరితి నివృత్త్యాపూయతేతు సః.(11-230

పాపముచేసి పశ్చాత్తాపపడువాడు ఆపాపము నుండి విముక్తుడగును. "ఇక నెన్నడును ఇట్లు చేయను" అని నిశ్చ యించుకొని యాతడు పాపమునుండి మరలి పవిత్రుడగును.

ఏవంసంచిన్త్య మనసా ప్రేత్యకర్మ ఫలోదయం
మనోవాఙ్మూర్తిభిర్నిత్యం శుభం కర్మ సమాచరేత్ 11-231

ఈరీతిగా మానవుడు తాను చేయు ఫలమునుగూర్చి విచారించి మనోవాక్కాయములచేత నెల్లప్పుడును శుభ కర్మనే ఆచరింపవలయును.

అజ్ఞానాద్యదివాజ్ఞానా త్కృత్వాకర్మ విగర్హితం
తస్మాద్విముక్తి మన్విచ్ఛన్ ద్వితీయంన సమాచరేత్.11-232

తెలిసికాని తెలియక కాని చెడ్డపనిని చేసినవాడు దాని నుండి విముక్తిని పొందగోరునో తిరిగి అట్టిపనిని చేయ కూడదు. ప్రాయశ్చిత్తము చేసికొనవచ్చును కదా యని పాపము నాచరించుట గర్హితము.

పాపనోదనమునకును అంతఃకరణ శుద్ధికిని మను స్మృతిలో బహువిధములైన ప్రాయశ్చిత్తములు చెప్పబడినవి. అందు కృచ్ఛ్రసాంతపన మొకటి.

గోమూత్రం గోమయం క్షీరందధి సర్పిః కుశోదకం
ఏకరాత్రోపవాసశ్చకృచ్ఛ్రంసాంతపనంస్మృతం.11-212

గోమూత్రము, గోమయము, గోక్షీరము, గోదధి, గోఘృతము, కుశోదకము కలిపి లోపలకు తీసికొనవలయును. ఆనాడు మరేమియు తినరాదు. మరునాడు పూర్తిగా నుపవాసము చేయవలయును.

ప్రాణావధిక ప్రాయశ్చిత్తములు కొన్ని కలవు. వ్యాహృతులతోను ఓంకారముతోను కూడుకొన్న పదునారు ప్రాణాయామములను నెల దినములు నిత్యము చేయుచో మహాదోషములుకూడ పోవును.

సవ్యాహృతి ప్రణవకాః ప్రాణాయామాస్తుషోడశ
అపిభ్రూణహాణంమాసాత్పునన్త్యహరహఃకృతాః.11-248

తాను చేసిన పాపములను పైకి చెప్పుటచేతను, పశ్చాత్తాప పడుటచేతను, తపస్సుచేతను, వేదపఠనముచేతను, దానము చేతను పాపమోచనము కల్గును.

ఖ్యాపనేనానుతాపేన తపసాఽధ్యయనేనచ
పాపకృన్ముచ్యతే పాపాత్ తథాదానేన చాపది (11-227

## అహింస

ఆధ్యాత్మిక సాధనములలో ముఖ్యమైనది అహింస. సన్యాసి సర్వమును పరిత్యజించినను అహింసా వ్రతమును మాత్రము పరిత్యజింపరాదని చెప్పబడినది.

ఇంద్రియాణాం నిరోధేన రాగ ద్వేష క్షయేణ చ
అహింసయా చ భూతానామమృతత్వాయ కల్పతే. (6-60

ఇంద్రియ నిగ్రహముచేతను, రాగద్వేష పరిత్యాగముచేతను సర్వభూతముల పట్లను అహింస నవలంబించుట చేతను అమృతత్వము సాధ్యమగును.

యోబంధన వధక్లేశాన్ ప్రాణినాం నచికీర్షతి
ససర్వస్యహితప్రేప్సుః సుఖమత్యంత మశ్నుతే. (5-46)

ఎవడు ప్రాణులను వధించుటకుగాని, బంధించుటకు గాని, బాధపెట్టుటకు గాని యిష్టపడడో, యెవడెల్ల ప్రాణులకును హితముకోరునో, వాడు అనంతమైన (మోక్ష) సుఖమును పొందును.

ఆహారము కొరకు గూడ ప్రాణులను హింసింపకూడదు.

అనుమంతా విశసితా నిహంతా క్రయవిక్రయీ
సంస్కర్తా చోపహర్తా చ ఖాదకశ్చేతి ఘాతుకాః. (5-51)

మాంసమును తినువాడు, కొట్టినవాడు, వండినవాడు, అమ్మినవాడు, [illegible] చంపినవాడు, అవయవములను విడదీసినవాడు, అనుమతించినవాడు, అందరును చంపినట్లే.

యోఽహింసకాని భూతాని హినస్త్యాత్మసుఖేచ్ఛయా
సజీవంశ్చ మృతశ్చైవ నక్వచిత్సుఖమేధతే. (5-45)

హింసను గల్గింపని ప్రాణులను (జంతువులనుకాని మనుష్యులనుకాని) తమసుఖముకొఱకు హింసించువారు జీవన్మృతులని చెప్పదగినవారు. అట్టివారికి ఇహపరములలో సుఖముండదు. (ఆత్మరక్షణ పరరక్షణములకొఱకు శస్త్రముతీయుట దోషముకాదని మనువు చెప్పియున్నాడు. (8-349, 350)

అహింసయేంద్రియాసంగై ర్వైదికైశ్చైవ కర్మభిః
తపసశ్చరణైశ్చోగ్రైః సాధయన్తీహతత్పదం. (6-75)

అహింసచేతను విషయసంగపరిత్యాగముచేతను, వైదికకర్మలచేతను, ఉగ్రతపస్సులచేతను బ్రహ్మపదమును చెందుదురు.

సర్వధర్మములలోను సత్యాహింసలకు మనువు అగ్రస్థానము నిచ్చుచున్నాడని యిదివఱకు చూచియుంటిమి. "హింసలేకుండ బ్రతుకగలమా? నడచునపుడు క్రిమికీటకాదులు చనిపోవుటలేదా? శాకములలో ప్రాణములేదా?" ఇత్యాది తర్కములకు మనుస్మృతిలో సమాధానముకలదు. ఈప్రశ్నలకు వెనుకనున్న భావము "ఈహింసను చేయుచున్నపుడాహింస నెందులకు చేయరాదు?" అనునది, మనువు చెప్పినదేమన:- పరపీడనము నెంతతక్కువగాచేసిన నంతమంచిది. బొత్తిగాచేయకుండుట సర్వోత్తమము.

అద్రోహేణైవ భూతానామల్పద్రోహేణవాపునః. (4-2)

(వృత్తిసంపాదనపరముగా చెప్పబడిన యీయంశము ఇతర విషయములకుకూడ వర్తించును.)

కావున ధార్మికుడెప్పుడును "ఇంతకంటె తక్కువ హింస సాధ్యముకాదా?" యను నాలోచనములో నుండవలయునే కాని "కొంతహింస యనివార్యముగా జరుగుచున్నందున మరికొంతహింసను ఎందులకు చేయకూడదు?" అను నాలోచన చేయరాదు.

## గాయత్రి జపము

గాయత్రి మూడు వేదముల సారము. ఓంకారముతోడను, భూః, భువః, సువః-అను వ్యాహృతులతోడను గూడిన గాయత్రిని సంధ్యాసమయములలో జపించు విప్రుడు మూడు వేదములను అధ్యయనము చేసిన పుణ్యమును పొందును. ఇట్లు జపము చేయనివాడు వేదాధ్యయనము చేసియున్నను అధ్యయనఫలమును పొందడు. అధ్యయనము చేయనివాడు కూడ నిట్టి జపము వలన మహాపుణ్యము పొందును.

ఏతదక్షర మేతాంచ జపన్ వ్యాహృతి పూర్వికాం
సంధ్యయో ర్వేదవి ద్విప్రో వేదపుణ్యేన యుజ్యతే,(2-78

సంధ్యాసమయములలో నేకాక యితరసమయములలో కూడ గాయత్రిని నదీతీరములను, అరణ్యములలోను వేయి పర్యాయములు జపించువాడు కుబుసము చేత పాము విడువబడునట్లు పాపము చేత విడువబడును.

సహస్రకృత్వస్త్వభ్యస్య బహిరేతత్త్రికం ద్విజః
మహతోఽప్యేనసోమాసాత్ త్వచేవాహిర్విముచ్యతే.2-79
యోఽధీతేఽహన్యహన్యేతాం త్రీణివర్షాణ్యతంద్రితః.
సబ్రహ్మ పరమభ్యేతి వాయుభూతః ఖమూర్తిమాన్.2-82

ఎవడు గాయత్రీ మంత్రమును అశ్రద్ధ లేనివాడై మూడు సంవత్సరములు ప్రతిదినము జపించుచునే యుండునో వాడు వాయువువలె సర్వత్ర సంచరించు శక్తిగలవాడై బ్రహ్మయే యగును.

ఏకాక్షరం పరంబ్రహ్మ ప్రాణాయామాః పరంతపః
సావిత్ర్యాస్తు పరంనాస్తి మౌనాత్సత్యం విశిష్యతే.(2-83

ఓంకారము పరబ్రహ్మప్రాప్తి సాధనము, ప్రణవ వ్యాహృతి శిరస్సులను గలిగిన త్రిరావృత్తి గాయత్రితో కూడినప్రాణాయామములే మహాతపస్సు. గాయత్రికంటె గొప్పమంత్రము లేదు.

## జపవిశేషములు.

విధియజ్ఞాజ్జపయజ్ఞో విశిష్టోదశభిర్గుణైః
ఉపాంశుస్స్యాచ్ఛతగుణః సాహస్రోమానసః స్మృతః.2-85

దర్శపూర్ణమాసాది యజ్ఞములకంటె జపము పదిరెట్లు గొప్పది. ఆజపములోను పైకి నుచ్చరింపబడు జపముకంటె ప్రక్కనున్న వానికికూడ వినబడనట్లు చేయబడు ఉపాంశు జపము నూరురెట్లు గొప్పది. ఉపాంశువు కంటెను పెదవులు, జిహ్వ, కదలకుండునట్లు చేయబడు మానస జపము వేయి

గొప్పది. (అయినను మానస జపము చేయుశక్తి కలుగు వఱకు ఉపాంశువును, ఉపాంశువును చేయుశక్తి కలుగువఱకు వాచికమును విడువరాదు.) ఈ జపవిశేషములు కూడ యజ్ఞములే.

జప్యేనైవతు సంసిధ్యే ద్బ్రాహ్మణో నాత్రసంశయః
కుర్యాదన్యన్న వా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే. 2-87

బ్రాహ్మణుడు యాగములు మున్నగువానిని చేయక పోయినను జపము చేతనే మోక్షార్హతను పొందును. యాగములో పశుహింస యున్నది. కాని జపములో నదికూడ లేదు. కావున యాగముకంటె జపము విశేషముగలది. యాగము కూడ వేదవిహితమగుటచే దానిని నిషేధించుట సంభవింపదు. "నహినిందాన్యాయము"గా నిచట జపము యొక్క ప్రాశస్త్యము చెప్పబడినది. ఇచ్చట యాగనింద ఉద్దేశింపబడలేదు.

## కామము

ఆత్మకల్యాణమునకు ప్రబలప్రతిబంధకమైన కామము సర్వథా త్యాజ్యము; కాని యనృతజడదుఃఖాత్మకమైన సంసారమునుండి సచ్చిదానందస్వరూపుడైన పరమాత్మను పొందవలయునను కోరికయు తత్సిద్ధికై వేదోక్తసాధనముల నవలంబింపవలయునను వాంఛయు మాత్రము త్యాజ్యములు కావు.

కామాత్మతా న ప్రశస్తా న చైవేహాస్త్యకామతా
కామ్యోహి వేదాధిగమః కర్మయోగశ్చ వైదికః. (2-2

కోరికలను గల్గియుండుట మంచిదికాదు. కాని బొత్తిగా కామములను వీడుట యనునది యుండదు. వేదమును నేర్చుట, వేదానుసారము ప్రవర్తించుటకూడ కోరికకు సంబంధించినవే. కాని యట్టి కోరికలు నిషిద్ధములు కావు. వేదోక్తకర్మ నిష్కామముగా నాచరింపబడునదో నది చిత్తశుద్ధిద్వారా మోక్షహేతు వగును. కావున నట్టి కర్మయోగముకూడ కామవిషయకమే యనుకొని వదలరాదు.

## దా న ము

యత్కించిదపి దాతవ్యం యాచితేనానసూయయా
వృత్పత్స్యతేహితత్పాత్రం యత్తారయతిసర్వతః.(4–228

వచ్చి యడిగినవానికి అంతో యింతో యిచ్చి తీరవలయును. దానమునందు అభ్యాసముగలవానికి ఎప్పటికైనను సంసారమునుండి తరింపజేయగల పుణ్యాత్ముడు ప్రతిగ్రహీతగా లభింపగలడు.

సర్వేషామేవదానానాం బ్రహ్మదానం విశిష్యతే
వార్యన్నగోమహీవాస స్తిలకాంచన సర్పిషాం (4–233)

గోభూదానాదు లన్నింటికంటెను వేదదానము(వేదాధ్యాపనము) గొప్పది.

ఇతరుల మెప్పుకొఱకు చెప్పుకొనుటవలన దానఫలము తగ్గిపోవును.

యజ్ఞోఽనృతేనక్షరతి తపఃక్షరతివిస్మయాత్
ఆయుర్విప్రాపరాధేన దానంచపరికీర్తనాత్. (4-237)

అసత్యమాడుటచే యజ్ఞముచేసినఫలము తగ్గిపోవును; "ఎంత తపస్సుచేసినాను!" అని తన తపస్సుపట్ల తానే ఆశ్చర్యపడుచో తపఃఫలము తగ్గును. విప్రులను నిందించుట వలన ఆయువు తగ్గును; చేసినదానమును గొప్పకొఱకు చెప్పుకొనుటవలన దానఫలము తగ్గును. దానమును శ్రద్ధతోను, గౌరవముతోను చేయవలయును.

యోఽర్చితం ప్రతిగృహ్ణాతి దదాత్యర్చితమేవచ
తావుభౌగచ్ఛతఃస్వర్గం నరకంతువిపర్యయే. (4-235)

ప్రతిగ్రహీతను పూజించుచునే దానము చేయవలయును. అట్లు చేయబడిన దానమునే గ్రహింప వలయును. ప్రతిగ్రహీతపట్ల గౌరవరహితముగా దానముచేసినవాడును, ఆదానమును పట్టినవాడునుగూడ నరకమునకేగెదరు.

సక్రమముగా చేయబడినదానమునకు దాతయొక్క సంకల్పము ననుసరించి ఫలముండును.

యేనయేనతుభావేన యద్యద్దానం ప్రయచ్ఛతి
తత్తత్తేనైవభావేన ప్రాప్నోతిప్రతిపూజితః. (4-234)

స్వర్గము కావలయునను కోరికతో దానముచేసిన వానికి స్వర్గఫలమే వచ్చును. అన్నసమృద్ధినికోరి దానము చేసిన వానికదియే లభించును. మోక్షమునకోరి దానము చేయువానికి మోక్షప్రాప్తియే కలుగును.

## తపస్సు

ఆధ్యాత్మిక బలము నొసగగలవానిలో తపస్సు శ్రేష్ఠ మైనది. అసాధ్యములన్నియు తపస్సువలన సాధ్యములగును.

యద్దుస్తరం యద్దురాపం యద్దుర్గం యచ్చదుష్కరం
సర్వంతుతపసాసాధ్యంతపోహి దురతిక్రమమ్. (11-238)

ఏదిదాట శక్యముకానిదో యేది పొందశక్యముకానిదో యేది ప్రవేశింప శక్యముకానిదో, యేదిచేయ శక్యముకానిదో అదియంతయు తపస్సుచేత సాధింపబడును. తపస్సు నేదియు మించజాలదు.

కావున చిత్తశాంతిని, వైరాగ్యమును, మోక్షమును కోరు మునులు తపస్సుచేయుట కాంచనగును. కామ్యములు కూడ తపస్సుచే సాధింపబడగలవు సాధారణములయిన తపస్సులలో చాంద్రాయణ వ్రతమొకటి. తానుతినుఆహారము పదునాలుగు కబళము లగుచో. మాసములో కృష్ణప్రతిపత్తు మొదలు 14దినములు దినమునకొక ముద్దచొప్పున తగ్గించుచు అమావాస్యనాడు గంజితాగి రెండవపక్షమున క్రమముగా దినమున కొక ముద్దచొప్పున ఆహారమును హెచ్చు చేయుచు పౌర్ణమినాడు తిరిగి గంజిమాత్రమే తీసికొన వలయును.

వానప్రస్థునకు తపస్సులు విశేషముగా విధింపబడినవి. ఆతడు గ్రీష్మర్తువులో పంచాగ్నిమధ్యమున తపస్సుచేయవల యును. (అనగా నాల్గుదిక్కులను నాల్గుఅగ్నులను, పైని

సూర్యుడు నుండగా తపస్సు చేయవలయును.) వర్షర్తువులో వానలో నిలచుండి తపస్సు చేయవలయును. హేమంతఋతువులో తడిబట్టలతోనుండి తపస్సు చేయవలయును. క్రమాభ్యాసముగా నిట్టి తపస్సును గావింపవలయును. ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము స్నానము చేయవలయును. దేవతలకును, పితరులకును తర్పణము చేయుచుండవలయును. ఉగ్ర తపస్సుల చేత శరీరమును శోషింప చేసికొనవలయును.

ఇట్టి తపస్సులు అంతఃకరణమును నిర్మలమొనరించి ఆత్మవికాసమును గల్గించి ఉపనిషదర్థమును ప్రత్యక్షజ్ఞానగోచరము గావించును.

## భక్తిమార్గము

సంధ్యావందనజపహోమాదులు కర్మలేయైనను భక్తికి సంబంధింపనివి కావు. అవియు నీశ్వరారాధనపద్ధతులే అది కాక కేవలము భక్తిపద్ధతికూడ మనువునకు సమ్మతమే. సృష్టిస్థితిలయములకు పరమేశ్వరుడే కారణమనియు, పరమేశ్వరసంకల్పానుసారమే సర్వము నడచుచున్నదనియు మనువు (ప్రథమాధ్యాయములో విపులముగా చెప్పియున్నాడు. భక్తిమార్గములో ప్రముఖస్థానమునుపొందిన దేవతావిగ్రహారాధనము కూడ మనువునకు సమ్మతము- పర్వదినములలో దేవాలయములకేగి దేవతాదర్శనము చేసికొనవలయునని చెప్పబడినది.

దైవతాన్యభిగచ్ఛేత్తు ధార్మికాంశ్చ ద్విజోత్తమాన్
ఈశ్వరంచైవ రక్షార్థం గురూనేవచ పర్వసు. (4-153

పర్వదినములలో దైవతములను ధార్మిక బ్రాహ్మణులను, గురువులను, రాజును దర్శించి తనకు క్షేమమును సంపాదించుకోనవలయును.

దేవతావిగ్రహములకు కానుకలర్పించు పద్ధతికూడ మనుస్మృతిలో కన్పట్టుచున్నది. దేవాలయాదులలో దేవతల కర్పింపబడిన ధనమును హరించినవాడు పాపాత్ముడని చెప్పబడినది.

దేవస్వం బ్రాహ్మణస్వంవా లోభేనోపహినస్తియః
స పాపాత్మాపరంలోకే గృధ్రోచ్ఛిష్టేన జీవతి.(11-26

దేవాలయములలో దేవునకు సువర్ణాది దానముకూడ కొన్నిసందర్భములలో విధింపబడినది. (7-20) దేవతానింద నిషేధింపబడినది!

నాస్తిక్యం వేదనిందాంచ దేవతానాంచ కుత్సనం
ద్వేషందంభంచ మానంచక్రోధంతైక్ష్ణ్యంచవర్జయేత్.4-163

పరలోకములేదను భావమును పొందరాదు. వేదమును నిందింపరాదు; దేవతలను దూషింపరాదు; ద్వేషమును, దంభమును, దురభిమానమును, కోపమును, ఇతరులపై మండిపడుటను విడచిపెట్టవలయును.

ఇట్లు మనుస్మృతి ప్రధానముగా కర్మమార్గప్రతిపాదకమేయైనను, అందందు వికీర్ణములైయున్న భక్తివిధాయక

వచనములు భక్తిమార్గము యొక్క శ్రేయస్సాధనత్వమును నిరూపించుచున్నవి.

## య మ ము లు—ని య మ ము లు.

త్రికరణశుద్ధము యైన బ్రహ్మచర్యము, దయ, శీతోష్ణాదులను నిందాపమానాదులను ఓర్చుకొనుశక్తి (శాంతి) పరమేశ్వరధ్యానము, సత్యము, ఆర్జవము (కౌటిల్యము లేకుండుట), అహింస, ఇతరులసొత్తు నపహరింపకుండుట, మధురముగా మాట్లాడుట, ప్రవర్తించుట, ఇంద్రియనిగ్రహము— ఇవి యమము లనబడును.

స్నానము, మౌనము, ఉపవాసము, యాగము చేయుట, వేదాభ్యాసము, బ్రహ్మచర్యము, గురుశుశ్రూష, శౌచము, కోపములేకుండుట, కర్తవ్యములపట్ల ఏమరపాటు లేకుండుట—ఇవి నియమము లనబడును.

[ఈ నియమములు యాజ్ఞవల్క్యస్మృతిలో (3-312, 313) పేర్కొనబడినవి:

బ్రహ్మచర్యం దయా క్షాంతి ర్ధ్యానం సత్యమకల్కతా
అహింసాఽస్తేయ మాధుర్యే దమశ్చేతి యమాః స్మృతాః,
స్నానం మౌనోపవాసేజ్యా స్వాధ్యాయోపస్థనిగ్రహాః
నియమా గురుశుశ్రూషా శౌచాక్రోధా ప్రమాదతా.]

యమములు నియమములు రెండు నాచరింపదగినవే యనియు నియమములకంటె యమములు ముఖ్యములనియు,

నియమములను పాటించినను యమములను పాటింపనిచో మానవుడు పతితుడగుననియు మనువు చెప్పుచున్నాడు.

యమాన్ సేవేత సతతం ననిత్యం నియమాన్ బుధః
యమాన్ పతత్యకుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్. 4-204

మనుస్మృతి వ్యాఖ్యాతయైన కుల్లూకభట్టీసందర్భమున నొక యుదాహరణము నిచ్చియున్నాడు: "స్నానము, అహింస-అను రెండింటిలో దేనినో యొకదానిని వదలుకొనవలసిన సందర్భము వచ్చుచో స్నానమునే వదలుకొనవలయును కాని అహింసను వదలుకొనరాదు" అని యాతడు చెప్పియున్నాడు. స్నానము నియమములలోనిది; అహింస యమములలోనిది.

## యోగాభ్యాసము

మనువు నిర్దేశించిన ఆధ్యాత్మికసాధనలలో యోగాభ్యాస మొక్కటి.

దహ్యన్తే ధ్మాయమానానాం ధాతూనాంహియథామలాః
తథేంద్రియాణాందహ్యన్తేదోషాఃప్రాణస్యనిగ్రహాత్.6-71

అగ్నిచే కాల్చబడుటవలన బంగారము మున్నగు ధాతువుల మాలిన్యము పోవునట్లు ప్రాణాయామమువలన మనస్సు యొక్కయు చక్షురాదీంద్రియములయొక్కయు దోషములు పోవును.

ప్రాణాయామైర్దహేద్దోషాన్ ధారణాభిశ్చకిల్బిషం
ప్రత్యాహారేణసంసర్గాన్ ధ్యానేనా నీశ్వరాన్ గుణాన్.

ప్రాణాయామములచేత రాగద్వేషాది దోషములను పోగొట్టుకొనవలయును. మనస్సును పవిత్రలక్ష్యమందు నిలబెట్టుటచేత పాపమును పోగొట్టుకొనవలయును. ప్రత్యాహారముచేత ఇంద్రియములను శబ్దాదివిషయములనుండి వెనుకకులాగి విషయసంసర్గములను నివారించుకొనవలయును. పరబ్రహ్మధ్యానమువలన కామక్రోధాదిపరమేశ్వరవ్యతిరిక్త గుణములను పోగొట్టుకొనవలయును.

ఉచ్చావచేషు భూతేషు దుర్జ్ఞేయామకృతాత్మభిః
ధ్యానయోగేన సంపశ్యేద్గతి మస్యాంతరాత్మనః (6-73)

ఈజీవునకు దేవాద్యుత్తమజన్మలును, పశ్వాదినికృష్ట జన్మలును ఎట్లు కల్గుచున్నవో తెలిసికొనుటకు హృదయసంస్కారములేనివారు అసమర్థులు; ధ్యానయోగముగలవారు సమర్థులు. ధ్యానముచే అట్టిజీవగతులను తెలిసికొన్నవాడు బ్రహ్మజ్ఞాననిష్ఠుడు కాదగును.

## ఉపసంహారము.

సమ్యగ్దర్శనసంపన్నః కర్మభిర్న నిబధ్యతే
దర్శనేన విహీనస్తు సంసారం ప్రతిపద్యతే. (6-74)

బ్రహ్మసాక్షాత్కారము గల్గినవాడు కర్మలచేత బంధింపబడడు. (వాని సంచితకర్మ జ్ఞానముచే నశించును.

ఆగామికర్మయు అణగిపోవునే కాని మొలకలెత్తదు. ప్రారబ్ధముకూడ దేహావసానముతో ముగిసిపోవును. వానికి తిరిగి జన్మలేదు. బ్రహ్మసాక్షాత్కారము కలుగనివాడు జనన మరణరూపసంసారములోనే యుండును.

బ్రహ్మసాక్షాత్కారము గల్గుటకుపూర్వము అవశ్యముగా నుండదగినచిత్తశుద్ధిని, వైరాగ్యమును, గల్గించుకొను సాధనము లీప్రకరణములో జెప్పబడినవి. మనుస్మృతిలో బ్రహ్మలక్షణములును ఉత్తమబ్రహ్మవిద్యాధికారి లక్షణములును, చరమసాధనస్వరూపమునుకూడ ఉదాత్తశైలిలో వర్ణింపబడియున్నవి. కాని యీతత్ప్రకరణోద్దేశము పూర్వసాధనలకుమాత్రము పరిమితమైయున్నది. ఈసాధనల నవలంబించువాడు చివరివఱకును పోజాలకపోయినను, చేసినసాధనము వ్యర్థముకాదు. ఉత్తరజన్మలలో నది మునుముందుకు సాగవచ్చును. అంతియేకాక ఈ సాధనలన్నియు పాపమును క్షయింపచేసి పుణ్యవృద్ధిని గావించునవగుటచే మోక్షము వఱకు పోజాలనిసాధకుడుకూడ దుఃఖములోను దుష్టజన్మలలోను పాపలోకములలోను పడకుండ ఉత్తమజన్మలను శుభలోకములనుపొంది సుఖమార్గములోనే యుండుటసంభవించును. కేవలమోక్షగ్రంథముకాక ధర్మగ్రంథమగు మనుస్మృతిలో నీసాధనలకు ప్రసంగమీరీతిగా నుపపన్నమగుచున్నది.

## గ్రంథోపసంహారము

సంగ్రహముగాను స్పష్టముగాను వేదమతమును ప్రతిపాదించు గ్రంథములలో మనుస్మృతియు, భగవద్గీతయు ఉత్తమోత్తమములు. కర్తవ్యాంశములను తెలుపుటలో మనుస్మృతియు, ఆత్మానందపథమును నిరూపించుటలో భగవద్గీతయు విశేషప్రశస్తి నొందినవి. మనుస్మృతిలో ఆత్మానందపథనిరూపణము లేకపోలేదు; అట్లే భగవద్గీతలో కర్తవ్యాంశనిర్దేశమును లేకపోలేదు. ఈరెండుగ్రంథములును పరస్పరతాత్పర్యపూరకములై కర్మబ్రహ్మనిరూపకమును స్వర్గాపవర్గఫలకము్నైన శ్రుత్యుపదేశమును ప్రతిబింబింపచేయు నిర్మలదర్పణములుగా నున్నవి.

సమానవరకల్యాణకరములైన యేతద్గ్రంథద్వయ మహోపదేశములపట్ల నెచ్చుమందికి అభిరుచియు, వీనికి లోకములో విశేషవ్యాప్తియు గల్గుట నాకాంక్షించుచు నేనిదివఱకు "భగవద్గీతాప్రవేశము"ను, ఇపుడీ "ధర్మమంజరి"ని దిక్ప్రదర్శకమాత్రములనుగా రచించియున్నాను. 2684 శ్లోకములతో విరాజిల్లుచున్న మనుస్మృతినుండి యవశ్యముగా నుదాహరింపవలసిన శ్లోకములనుగూడ కొన్నింటినో విడచివైచుట కొకకారణము ఇదివఱకే ప్రకటింపబడిన నాయితరగ్రంథములలో ఆశ్లోకములుకాని వానితాత్పర్యముకాని యుల్లేఖింపబడియుండుట. ఈగ్రంథములో నుదాహరింపబడిన మనువచనములను వివరించుటలో పదానువాద భావానువాద

తాత్పర్యనిర్దేశాదిపద్ధతులలో నేనొక్కటియు సార్వత్రికముగా నుపకరింపదు; కావున నేపద్ధతి యెటకార్యకారియో యటనాపద్ధతి యవలంబింపబడినది.

క్వచిద్గిరామాంధ్రపదానువాదః
క్వచిత్తు తాత్పర్యనివేదనంచ ।
క్వచిత్తథా భావనిరూపణంచ
క్వచిచ్చసంక్షేపత ఏవసర్వమ్.

క్వచిత్స్వతంత్రప్రతిపాదనం స్యా
ద్యథా చమూలానుగుణం తథైవ ।
బహుప్రదేశేషు విశేషభావాః
కుల్లూక భట్టప్రతిపాదితాశ్చ.

స్మృత్యంతరాభ్యాసజ సంస్కృతేస్తు
వ్యాఖ్యానరూపేణచ కించిదుక్తం ।
ఇత్థం మనోర్మార్గదిశం శుభాధ్యాం
నిర్దేష్టుమేవాఽత్రకృతః ప్రయత్నః.

మనుకల్పతరోరేషా
ధర్మప్రసవమంజరీ ।
స్వగంధేన సమాకృష్య
మూలం నయతుపాఠకం.



1932 ఏప్రిల్‌లో కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ కార్యదర్శి శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారు సనాతన ధర్మమునపై కొన్ని ఆక్షేపణములను గావించుచు ఆంధ్రపత్రికలో నొక వ్యాసము వ్రాసిరి. దానికి సమాధానముగా పురుషోత్తముగారొక వ్యాసమును ఆంధ్రపత్రికలోనే వ్రాసిరి. పురుషోత్తముగారి వ్యాసము విమర్శనమునకు సంతోషమును వెలిబుచ్చుచు మరికొన్ని ఆక్షేపణములనుగూడ చేయుచు పంతులుగారు ఇంకొక వ్యాసము వ్రాయుటయు దానికికూడ పురుషోత్తముగారు సమాధానము వ్రాయుటయు సంభవించెను. (పంతులుగారి మన స్వాతంత్ర్యము—చతుర్థభాగము 142- 146 పుటలు చూడదగును)

ఇది జరిగిన కొలదిదినములకే పురుషోత్తముగారు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమునకు ప్రిన్సిపాల్‌గా నియుక్తులైరి.

1932నుండి 1937 వఱకును పంతులుగారు కార్యదర్శిగాను పురుషోత్తముగారు ప్రిన్సిపలుగాను ఒకేసంస్థను నిర్వహించుటయే గాక ప్రతి దినము అనేకవిషయములనుగూర్చి చర్చించుకొనుచుండిరి. అనాటినుండియు పురుషోత్తముగారిమీద పంతులుగారికి సదభిప్రాయము పెరుగుచునే యుండెను. సభావేదికమీదను ఆంధ్రపత్రికలోను ఒకరనొకరు ఖండించుకొనుటకూడ సాగుచునేయుండెను. (మనస్వాతంత్ర్యము చతుర్థభాగము 39వ పుట, 139వపుట చూడదగును.)

పురుషోత్తముగారి బుజావర్తనముపై పంతులుగారి కెంత విశ్వాసము కలిగెననగా వారు తమవిల్లులో సుమారు 70 వేలరూపాయల ధర్మనిధి యొక్క వినియోగమును నిర్ణయించు అధికారముగల పరిషత్తులో తమసమానులిద్దరితో బాటు పురుషోత్తముగారిని శాశ్వతసభ్యులనుగా నియమించిరి..

విషయము నతిక్రమింపకుండుట, ప్రతివాదముమీదకే కాని, ప్రతివాదిమీదకు పోకుండుట ఈలక్షణములు అప్పటికే పురుషోత్తముగారి ఉపన్యాసములకును రచనలకును విశిష్టతనుకూర్చినవి.

(1957లో ప్రచురింపబడిన 'భారతీయ వైభవము'లోను 'హిందూమతము' లోను ప్రచురింపబడిన అంశములతో అనుసంధింపదగినది.)